Licenced to Post without Prepayment (PMG/VJ/PWPP/17/2009-11)

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు    స్థాపితం: 1930    జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

Longest Living Newspaper in Telugu Journalism

# జమీన్‌రైతు

సంపుటి: 81 • సంచిక: 26 • 25-6-2010 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-





# ఓ దేవా! మా పార్టీని ఓడించు!

• *తెలంగాణ కాంగ్రెస్‌వాదుల వేడుకోలు.*

తెలంగాణ ప్రాంతంలో జరుగుతున్న ఉప ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ విచిత్రమైన పరిస్థితి ఎదుర్కొంటున్నది. ఈ ఎన్నికలలో తమ పార్టీ ఓడిపోవాలని వెయ్యి దేముళ్లకు మొక్కుతున్నారు కాంగ్రెస్‌వాదులు. టిఆర్ఎస్ రాజీనామాల వల్ల ఏర్పడిన ఖాళీలివి. ప్రత్యేక తెలంగాణ ఉద్యమ ఒత్తిడి వ్యూహంలో భాగంగా రాజీనామాలు చేశారు టిఆర్ఎస్ శాసనసభ్యులు. ఆ ఖాళీలకు జరిగే ఎన్నికలలో మళ్లీ టిఆర్ఎస్ సభ్యులే గెలిస్తే, తెలంగాణ సెంటిమెంట్ ప్రబలంగా వున్నట్లు రుజువు. వీటిలో ఏ కొన్ని టిఆర్ఎస్ చేజారినా, ఉద్యమ పలుకుబడి క్షీణిస్తుంది. దానితో కాంగ్రెస్‌లోని తెలంగాణ వాదులంతా ఈ ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ ఓడిపోవాలని కోరుకొంటున్నారు. అందుకు తమ శక్తి యుక్తులన్నీ ప్రయోగిస్తున్నారు. ప్రత్యక్షంగా కె.కేశవరావు, మధుయాష్కీ వంటివారు, పరోక్షంగా జైపాల్‌రెడ్డి తదితరులు వెయ్యి దేముళ్లకు మొక్కుతున్నారు – ఓ దేవా మా పార్టీని ఓడించు అని వేడుకొంటున్నారు. అసలు కాంగ్రెస్‌ను పోటీకి పెట్టకుండా నివారించాలని వీరు చాలా ప్రయత్నం చేశారు. కానీ అధిష్టానం అందుకు సమ్మతించలేదు. పిసిసి అధ్యక్షుడు డి.శ్రీనివాస్ పలుకుబడి పని చేసింది అక్కడ. గత ఎన్నికలలో ఓటమిపాలై, దిక్కులేని పక్షి వలె విలవిలలాడుతున్న రాజకీయ జీవి ఆయన. ఈ ఉప ఎన్నికలలో ఏట్లయినా గెలిచి, ప్రభుత్వంలో చోటు సంపాదించి, మరొకసారి వెలుగు వెలగాలన్నది ఆయన అభిలాష. అందువల్ల సోనియాగాంధీ దగ్గర నుంచి అందరికీ ఉప ఎన్నికలకు అనుకూలంగా నివేదికలు ఇచ్చి, పోటీకి ఒప్పించి వచ్చారు.

మొత్తం పది స్థానాలకు జరిగే ఉప ఎన్నికలలో కనీసం రెండు స్థానాలలో కాంగ్రెస్ గెలుపొందుతుందని అంచనా. తెలంగాణ సెంటిమెంట్‌ను దెబ్బ తీయడానికి ఆ మాత్రం గెలుపు చాలు. వైఎస్ బ్రతికి వున్నప్పుడు ఇదే పరిస్థితి వచ్చింది ఒకసారి. అప్పుడు కూడా 16 మంది టిఆర్ఎస్ ఎమ్మెల్యేలు రాజీనామా చేశారు. అయితే ఆ ఉప ఎన్నికలను వైఎస్ ప్రతిష్టగా తీసుకొని, కోట్లాది రూపాయలు క్రుమ్మరించి, టిఆర్ఎస్ కార్యకర్తలను టోకున కొనుగోలు చేసి గెలుపు సాధించారు. ఆ ఎన్నికలతో చావు దెబ్బ తిన్నది టిఆర్ఎస్. అయితే ఇప్పుడు కాంగ్రెస్ పక్షంగా అంత పోరాటం చేసేవారు ఎవరూ లేరు. ముఖ్యమంత్రి రోశయ్యకు ఇటువంటి విషయాలు పట్టవు. తనకు సంబంధం లేదని పక్కకు తప్పుకోవడం ఆయన అలవాటు. ఉప ఎన్నికల భారం మోసే నాయకుడు కాంగ్రెస్‌లో మరొకరు లేరు. ఒక్క డిఎస్ మాత్రమే పోరాటం జరపాలి. అయితే ఆయన పోరు తన స్వంత నియోజకవర్గానికి మాత్రమే పరిమితం అవుతుందన్నది నిజం.

ఈటెల రాజేంద్ర, హరీష్‌రావు వంటి టిఆర్ఎస్ నాయకులు కాంగ్రెస్ నేతలు ఇళ్ల చుట్టూ గిరికీలు తిరుగుతున్నారు. తెలంగాణ కోసం పార్టీ అభిమానం పక్కనపెట్టి, తమకు మద్దతు ఇమ్మని వేడుకొంటున్నారు. ఈ ఎన్నికలలో గెలిస్తేనే టిఆర్ఎస్‌కు బ్రతుకు. లేకుంటే ఆ పార్టీ అదృశ్యమై పోతుంది. తెలంగాణ వాదమూ బలహీన పడుతుంది. పొన్నాల లక్ష్మయ్య, కోమటిరెడ్డి వెంకటరెడ్డి, ఎం.సత్యనారాయణ రావు, దుద్దిళ్ల శ్రీధర్‌బాబు వంటి వారంతా టిఆర్ఎస్ మొగమాటానికి లోనైనారని చెప్తున్నారు. కాంగ్రెస్‌ను ఓడించి టిఆర్ఎస్‌ను గెలిపించే బాధ్యత తీసుకోవడానికి ఈ కాంగ్రెస్ నేతలంతా సుముఖత చూపారట.

వైఎస్ బ్రతికి వుంటే అటువంటి వ్యవహారాలను కఠినంగా అణిచి పారేసి వుండేవాడు. కానీ ఇప్పుడు అటువంటి వారి జోలికి వెళ్లేవాడు ఎవరూ లేదు.

అయితే టిఆర్ఎస్ నేతలకు మాత్రం మనసులో గుబులుగుబులుగా వుంది. చీటికి మాటికి రాజీనామాలు చేసి, ఉప ఎన్నికలు తెచ్చి పెడుతున్నారనే నిరసన ఓటర్లలో వ్యక్తం కావడమే అందుకు కారణం. మరొకప్రక్క కాంగ్రెస్, తెలుగుదేశం కొరవ 14వ పేజీలో

## కార్టూన్ స్కేప్




'పోటీ చేసి ఓడిపోతే' కాంగ్రెస్‌తో స్నేహం చెడుతుందనా సార్?!

# ప్రాణమంత చవకా?

అమెరికా తీరంలోని గల్ఫ్ ఆఫ్ మెక్సికోలో ఆయిల్ లీక్ దుర్ఘటన ప్రపంచాన్ని కలవర పరుస్తున్నది. అమెరికన్ చరిత్రలో సముద్రంలోకి ఇంత పెద్ద మొత్తంలో ముడి చమురు ప్రవహించడం ఇదే ప్రథమమట. దాని ఫలితంగా ఆ ప్రాంతంలోని చేపలు, ఇతర జల చరాలకు ప్రమాదం ఏర్పడింది. ఆ దుర్ఘటనలో 11 మంది కార్మికులు ప్రాణాలు కోల్పోయారు. అమెరికన్ అధ్యక్షుడు బరాక్ ఒబామా దీన్ని తీవ్రంగా పరిగణించాడు. సముద్రం అలలలో కొన్ని వందల కిలోమీటర్ల మేర పేరుకపోయిన చమురు తెట్టును శుద్ధి చేయడానికి అయ్యే ఖర్చు మొత్తం ఆ ఆయిల్ కంపెనీ భరించాలని ఆదేశించాడు. అందుకోసం 20 బిలియన్ డాలర్ల నిధి ఏర్పాటు చేసేందుకు ఆ కంపెనీని బలవంతం చేసి ఒప్పించారు. 20 బిలియన్ డాలర్లంటే 92వేల కోట్ల రూపాయలు. సామాజిక బాధ్యతగా భావించిన ఆ కంపెనీ ఆ మొత్తాన్ని ప్రత్యేక ఖాతాలో జమ చేసింది.

భోపాల్ ఘోర ప్రమాదంపై 26 సంవత్సరాల తర్వాత కోర్టు తీర్పు వెలువడిన సమయంలోనే అమెరికాలో ఈ పరిణామాలు చోటు చేసుకోవడం గమనార్హం. 17వేల మంది అమాయక పౌరులు ప్రాణాలు కోల్పోయిన దారుణ సంఘటన అది. పాతికేళ్ల తర్వాత కూడా ఈ నాటికీ లక్షలాది మంది ప్రజలు ఆనాటి విష వాయువులు పీల్చిన దుష్ఫలితాలు అనుభవిస్తూనే వున్నారు. ఇప్పటికీ ఆ బాధిత స్త్రీలు గర్భం ధరిస్తే, కడుపులోని బిడ్డలు వికలాంగు లుగా మారిపోతున్నారు. క్యాన్సర్ వంటి భయంకర రోగాలు వారిని పీల్చి పిప్పి చేస్తున్నాయి. కానీ భారత ప్రభుత్వంలో చలనం లేదు. 17వేల మంది ప్రాణాలు తీయడానికి కారణమైన యూనియన్ కార్బైడ్ కంపెనీ చెల్లించిన నష్టపరిహారం 400 బిలియన్ డాలర్లు మాత్రమే. ఆనాటి డాలర్ విలువతో లెక్క కడితే, ఆ మొత్తం కేవలం 600 కోట్ల రూపాయలు మాత్రమే. ఒక్కొక్క బాధితుడి చేతిలో 25వేల నుంచి 50 వేల రూపాయలు మాత్రమే పెట్టి సరి పుచ్చింది ఆ కంపెనీ. తమకు న్యాయం చేయాలని, న్యాయమైన మొత్తాన్ని నష్టపరిహారంగా ఆ కంపెనీ నుంచి రాబట్టాలని బాధిత కుటుంబాల వారు ఇన్నేళ్లుగా పోరాటం చేస్తున్నా మన నేతలలో కదలిక లేదు. భారత ప్రభుత్వం, సర్వోన్నత న్యాయస్థానం కూడా బాధితులను వదలిపెట్టి, ఆ కంపెనీ కొమ్ము కాస్తున్నాయి.

11 మంది ప్రాణాలు తీసిన పొరపాటుకు 92వేల కోట్ల రూపాయల నష్టపరిహారం; 17వేల మందిని కిరాతకంగా చంపిన బాధ్యతారాహిత్యానికి పరిహారం మాత్రం కేవలం 600 కోట్ల రూపాయలు. ఎక్కడి న్యాయం ఇది. భారతీయుల ప్రాణాలు అంత చవకైనవా? వాటికి విలువ లేదా? భోపాల్ దుర్ఘటనకు కారకులైన దోషులకు రెండేళ్ల స్వల్ప కారాగార శిక్ష విధించి, మన దేశంలోని న్యాయస్థానాల తీరును చాటి చెప్పింది. ఈ తీర్పుకు దేశవ్యాప్తంగా నిరసనలు పెల్లుబకడంతో ప్రజలు కళ్లు కప్పడానికి, కన్నీళ్లు తుడవడానికి కేంద్ర ప్రభుత్వం తన నిధుల నుంచి మరొక 1500 కోట్ల రూపాయలు నష్టపరిహారం చెల్లిస్తామని ప్రకటించింది. కానీ అమెరికన్ ప్రభుత్వం తమ దేశపౌరుల ప్రాణాలకు కట్టిన విలువతో పోలిస్తే అది కూడా నామ మాత్రం క్రిందనే లెక్క

మన నేతల బుద్ధి ఈనాటికీ మారలేదని చెప్పడానికి మరొక ఉదాహరణ – న్యూక్లియర్ లయబిలిటీ బిల్లు. అమెరికా వంటి దేశాలు సరఫరా చేసే అణురియాక్టర్లలో వారి యంత్ర పరికరాల లోపం వల్ల ప్రమాదాలు జరిగినా, ప్రజలు ప్రాణాలు కోల్పోయినా వారి నుంచి నష్టపరిహారం కోరకుండా నిషేధించే చట్టం ఇది. అణురియాక్టర్లలో ప్రమాదం జరిగితే, ఆ విధ్వంసం భోపాల్ దుర్ఘటనల కంటే కొన్ని వేల రెట్లు అధికంగా వుంటుంది. మైళ్ల పర్యంతం ప్రాణమన్నది మిగలదు. అంటే అమెరికన్ వ్యాపార వేత్తలు నాసిరకం యంత్రాలు సరఫరా చేసి, మన ప్రజలు ప్రాణాలతో చెలగాటమాడినా తప్పు లేదని మన ప్రభుత్వమే చెప్తున్నదన్న మాట. అమెరికన్ పాలకుల మోచేతి నీళ్లు త్రాగే హీనమైన బుద్ధితో, వారు ఆడమన్నట్లల్లా ఆడడానికి సిద్ధపడుతున్న కేంద్ర ప్రభుత్వ పాలకులను చూస్తే అసహ్యం కల్గుతున్నది. భోపాల్ దుర్ఘటన బాధితుల గోడు చూసిన తర్వాత కూడా, అమెరికన్ పాలకులు తమ ప్రజల ప్రాణాలకు కట్టే విలువ చూసిన తర్వాత కూడా మన నేతలలో జ్ఞానోదయం కలగక పోవడం శోచనీయం.

జమీన్‌రైతు

## జనవాణి

### విజ్ఞత మరచిన ప్రభుత్వం

జాతిపిత గాంధీ మహాత్ముని కలలను చినాభిన్నం చేస్తూ మద్యం పట్ల మన ప్రభుత్వం చూపిస్తున్న లాభాపేక్ష విస్మయం కలిగించక మానదు. తమ అంచనాలను మించి వచ్చిన లాభాలను చూసి ప్రభుత్వం ఉక్కిరి బిక్కిరి అవుతుంది. ఇక మీదట ప్రభుత్వం యువతను ప్రభుత్వ ఉద్యోగాల పట్ల శ్రద్ధకన్నా మద్యం షాపులు పెట్టుకోమని సలహా ఇవ్వవచ్చు. మద్యం షాపుల కోసం టెండర్లు వేసిన వారిలో మహిళలు, యువతులు వుండడం గమనార్హం. ఒకప్పుడు మద్య నిషేధం కోసం పోరాడిన మహిళామణులు మద్యం టెండర్లు వేయడం శోచనీయం. ప్రభుత్వం విజ్ఞత మరచి మద్యంతోనే మనుగడ అనే దృక్పథానికి రావడం విచారకరం.

పి.సుధామయి నెల్లూరు

### ఎన్టీఆర్‌ను నిందించడమా?

ఆంధ్రుల ఆత్మగౌరవాన్ని విశ్వమంతా ప్రసరింపజేసిన మహానటుడు, మరపురాని నేత స్వర్గీయ ఎన్టీ రామారావు. అటువంటి గొప్ప వ్యక్తి ప్రేతాత్మ అయ్యాడంటూ నెల్లూరు రూరల్ శాసనసభ్యుడు వివేకానందరెడ్డి వ్యాఖ్యానించడం దారుణం. నోట్లో నాలుకున్నది కదా అని ఏ మాటంటే ఆ మాట మాట్లాడడం వివేకానందరెడ్డికి తగదు. రాజకీయంగా కష్టకాలంలో వున్నప్పుడు ఆనం కుటుంబీకులను ఎన్టీఆర్ ఆదరించి వారి ఇంట్లో వారికి రెండు అసెంబ్లీ టిక్కెట్లు ఇచ్చి, రామనారాయణరెడ్డిని మంత్రిని చేసిన విషయం మర్చిపోతే ఎలా?

కె.సుజాత కావలి

### కస్తూర్బా కళాక్షేత్రంలో మద్యం టెండర్లా?

మద్యం షాపులకోసం టెండర్లను నెల్లూరులోని వెంకటేశ్వర కస్తూరిబా కళాక్షేత్రంలో ప్రతి ఏడాది నిర్వహిస్తున్నారు. ఇంతకన్నా అన్యాయం ఇంకొకటి లేదు. బ్రతికినంత కాలం కస్తూరిబా మద్యానికి వ్యతిరేకంగా పోరాడారు. ఆమె స్మృత్యంకంగా నిర్మించిన కళాక్షేత్రంలో ఈ టెండర్ల నిర్వహణను ఇకనైనా జిల్లా అధికార యంత్రాంగం మార్చ మనవి.

టి.కోటేశ్వరరావు కోవూరు

### మేలు చేయని ఎఫ్‌సిఐ!

రైతులను మిల్లర్లు, ఎఫ్‌సిఐ అధికార్లు ఒక పథకం ప్రకారం అల్లాడించి

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

28-6-1940
పేజీలు : 16 వెల: అణా

### నెల్లూరు ముచ్చట్లు

#### మునిసిపల్ ఎలక్షన్

బహుశా ఈ సంవత్సరం ఈ ఎన్నికలు వస్తవో రావో? కాని అప్పుడే హంగామా జరుగుతున్నట్లు ధ్వనులు మాత్రం వినిపిస్తున్నవి. కాని కాంగ్రెసు ఈ సంవత్సరం మునిసిపల్ ఎన్నికల్లో దిగవలెనా? అక్కరలేదా? అనేది ముందుగా తేల్చడం మంచిది. నన్నడిగితే చేతులు ముడుచుకొని కూర్చోమంటా; కాంగ్రెస్ పేరుతో ఏమి జేసి ఏడ్చినాము కాబట్టి తిరుగా ప్రజల వద్దకు బోయి ఓటివ్వమని అడుగుదాము?

జిల్లాబోర్డు – మున్సిపాలిటీలకు ఏమన్నా ప్రోగామిచ్చి చేయిస్తే గదా? పిసిసి వారు.

ప్రకాశం పంతులూ! తన హయాంలోనన్నా ఈవిషయం తేల్చకుంటే ఇహ మొహమెత్తుకొని ఓటర్ల ముందుకు మేం పోలేమయ్యా!

ఏ.సి.రెడ్డికి భేది మాత్ర: అన్న దేవుల రెడ్డి నిలస్తాడనీ, పోటీ చేస్తాడనీ తెలుస్తోంది అబ్బే! మునలి కంపు అంటుందేమో మునిసిపల్ కన్య.

#### 12 సేర్ల కుంచం

12 సేర్ల కుంచంతో రైతులు ధాన్యం కొలుస్తున్నారని ఎవరో ఒక వ్యాపారస్తుడు కలెక్టరు నోటీసుకు తెచ్చాడట. పిచ్చిముంతలతో కొల్చేది కూలీలకు జీతగాండ్లకుగాని వ్యాపారస్తులకు గాదు. ఇంకా 14 సేర్ల కుంచానికి బదులు 14 1/2, 15 సేర్ల కుంచాలతో వర్తకులు రైతుల్ను దగా చేస్తున్నారని కలెక్టరు వారి నోటీసుకు తెస్తే మెరుగు.

#### మా శర్మ పెళ్లి

మన టివిఎస్ శర్మ గారికి ఈ మధ్య పెండ్లి జరిగింది. బెజవాడలో ఈపెండ్లికి సుప్రసిద్ధ ఫిలిం దర్శకుడు వైవిరావు మున్నగు పెద్దలొచ్చారు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

24-6-1960
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### గవర్నరు ప్రసంగం

ఆంధ్రప్రదేశ్ శాసనసభ సంయుక్త సమావేశంలో గవర్నరు భీమసేన్ సచార్ తన ఉపన్యాసాన్ని మొదట తెలుగులో ప్రారంభించారు; తెలుగులో తవుడుకొని చదువ వలసి వస్తుందని ఉర్దూలోకి దిగారు; ఉర్దూ సభ్యులలో ఎక్కువ మందికి అర్థం గాదు కాబట్టి కడకు ఇంగ్లీషులో కొనసాగించారు.

శాసన సభల ప్రారంభ సమావేశంలో అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులు నీలం సంజీవరెడ్డిగారు గూడా పాల్గొన్నారు.

### కాంగో స్వాతంత్ర్యం

ఆఫ్రికా ఖండంలో భూమధ్యరేఖ వెడుతున్న ప్రదేశంలో గల కాంగో రాజ్యము ఈ నెలాఖరున స్వాతంత్ర్యం పొందనున్నది. ఇది ఆఫ్రికా ఖండంలో అతి ప్రాచీనమైన అనాగరిక ప్రదేశం. కాంగోలో ఎక్కువభాగం బెల్జియమ్ వలసగా వుంటున్నది. జూన్ 30తేది, కాంగోలీలకు విముక్తి దినం.

అధికారాన్ని స్వీకరించే లోపలనే కాంగోలో రెండు ఛాయా ప్రభుత్వాలేర్పడినవి. కాని వీటి సంఘర్షణలో కాంగో జాతీయ నాయకుడు లుముంబా ప్రభుత్వ నాయకుడుగా ఎన్నికైనాడు.

లుముంబా నాయకత్వాన, కాంగోరాజ్యం, ఆఫ్రికా నల్ల సీమకు, ఘనావలెనే, క్రొత్త వెలుగు కాగలదని ఆశిద్దాం.

### స్వతంత్రపార్టీ కొత్త అధ్యక్షుడు

ఆంధ్రప్రదేశ్ స్వతంత్రపార్టీ అధ్యక్షుడుగా బెజవాడ రామచంద్రారెడ్డిగారు ఎన్నుకోబడ్డారు. ఇంతవరకు రైతునాయకుడు గొర్రెపాటి వెంకటసుబ్బయ్య అధ్యక్షులుగా వుంటున్నారు. ప్రజలలో ఏమాత్రం సంబంధం లేని రామచంద్రారెడ్డి బోటి వ్యక్తి అధ్యక్షుడు కావడం పార్టీని రాష్ట్రంలో బలహీన పరచడమే.

# నెల్లూరు ముచ్చట్లు

## జిల్లా సరిహద్దుకు ప్రధాని రాక!

నెల్లూరు – చిత్తూరు జిల్లాల సరిహద్దు వెంకటగిరికి కూతవేటు దూరంలోని మన్నవరం గ్రామంలో బిహెచ్ఈఎల్(భెల్) నెలకొల్పే విద్యుత్ ఉపకరణాల సంస్థ శంకుస్థాపన జూలై 10వ తేదీ ప్రధాన మంత్రి డాక్టర్ మన్మోహన్‌సింగ్, యుపిఏ ఛైర్‌పర్సన్ శ్రీమతి సోనియాగాంధీ తరలిరానున్నారు. ఈ ప్రతిష్టాత్మక సంస్థ ఏర్పాటు ద్వారా వెంకటగిరి నియోజకవర్గంలోని యువతకు ఉపాధి అవకాశాలు మెరుగు పడతాయి.

## తెలుగుదేశం పుష్పక విమానం!

తెలుగుదేశం పార్టీ జిల్లా కార్యవర్గాన్ని ఎట్టకేలకు ఆ పార్టీ అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్ రెడ్డి ప్రకటించారు. పుష్పక విమానాన్ని తలపించేలా 79 మందితో దీన్ని రూపుదిద్దారు. 11 మంది ఉపాధ్యక్షులు, 17 మంది కార్యనిర్వాహక కార్యదర్శులు, 18 మంది కార్యవర్గ సభ్యులు, 11 మంది ప్రత్యేక ఆహ్వానితులతో అందరినీ సంతృప్తి పరిచారు.

తెలుగు యువత అధ్యక్షునిగా పాతకాపు పమిడి రవికుమార్ చౌదరిని నియమించారు. తెలుగు మహిళ జిల్లా అధ్యక్షురాలిగా నగరంలోని హరనాథపురం ప్రాంత కార్పొరేటర్ అంచల వాణిని చేశారు. తెలుగు రైతు విభాగానికి పాతకాపు రాపూరు సుందరరామిరెడ్డికి బాధ్యతలు అప్పజెప్పారు.

బిసి విభాగానికి నూనె మల్లికార్జున యాదవ్, ఎస్సీ విభాగానికి బద్దెపూడి రవీంద్ర, ఎస్టీ విభాగానికి మోడెం శ్రీనివాసులు, వాణిజ్య విభాగానికి కొండాలపల్లి శేషయ్య, మైనార్టీ విభాగానికి మున్వర్, సాంస్కృతిక విభాగానికి దొర్నాల హరిబాబు, డాక్టర్స్ విభాగానికి డాక్టర్ టి.వి.నాయుడు, చేనేత విభాగానికి రాంప్రసాద్ అధ్యక్షులుగా వ్యవహరిస్తారు.

పార్టీ అధికార ప్రతినిధులుగా డాక్టర్ జడ్.శివప్రసాద్, దొంతలూరి వెంకటేశ్వరరావు వ్యవహరిస్తారు. ప్రచార కార్యదర్శిగా గూటూరు కన్నబాబు, కోశాధికారిగా మేదరమెట్ల వెంకటకృష్ణారెడ్డిని ఎంపిక చేశారు.

## రామనారాయణను కలసిన బాలకృష్ణ!

సినీ నటుడు నందమూరి బాలకృష్ణ 19వ తేదీ హైదరాబాద్‌లో పురపాలక శాఖ మంత్రి ఆనం రామనారాయణరెడ్డిని కలిశారు. ఇక్కడి ఫిల్మ్‌నగర్ చౌరస్తాలో ఏర్పాటుచేయ తలపెట్టిన ఎన్టీరామారావు విగ్రహానికి స్థలం, అనుమతి యిప్పించమన్నారు. రామనారాయణ ఈ ప్రతిపాదనకు ఓకే చెప్పారు.

## కల్లూరుపల్లిలో ఇళ్ల కూల్చివేత

కల్లూరుపల్లిలో సిపిఎం పార్టీ సహాయ సహకారాలతో ఇళ్లు, వాకిళ్లు నిర్మించుకొన్న వందలాది కుటుంబాలను రూరల్ ఎమ్మెల్యే వివేకానందరెడ్డి ఆదేశంతో రెండు గంటల్లో దిక్కుమొక్కులేని వాళ్లని చేసిపారేశారు. 20వ తేదీ వేకువజామున వందలాదిగా తరలి వచ్చిన పోలీసులు, రెవిన్యూ సిబ్బంది బుల్‌డోజర్లతో పక్కా ఇళ్లను నిమిషాల్లో నేలమట్టం చేసిపారేశారు. సిపిఎం నాయకులు ఉప మేయర్ మాదాల వెంకటేశ్వర్లు, మోహన్‌రావులు అడ్డుకోబోయి పెద్ద సంఖ్యలో వున్న పోలీసుల ముందు నిలబడలేక పోయారు. నగరంలో ఎన్ని వందల ఎకరాల ప్రభుత్వ భూములు దురాక్రమణలో లేవు. వీటిని సైతం కల్లూరుపల్లి తరహాలో నేలమట్టం చేసే ధైర్యం, అధికారం మొన్నటి ధ్వంస రచనలో పాల్గొన్న వారికుందా?

## జనాన్ని చెడిపేశాం!

ఏబీఎన్ – ఆంధ్రజ్యోతి టీవీ 21వ తేదీ నెల్లూరులో యధా ప్రజ – తధా రాజ అనే కార్యక్రమాన్ని నిర్వహించింది. ఈ కార్యక్రమంలో నెల్లూరు నేతలు పలు విషయాల్లో తాము చేసిన తప్పులను నిజాయితీగా ఒప్పుకొని ఆశ్చర్యపరిచారు.

ఓటర్లకు డబ్బులిచ్చే అలవాటును రాజకీయ నేతలే చేశారని తెలుగుదేశం పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి చెప్పుకొచ్చారు. నీతి నిజాయితీగా వుండే నేతలు ఎన్నికల్లో పోటీచేయలేక ఇళ్లలో కూర్చోవాల్సి వస్తుందన్నారు. ప్రజలు డబ్బులు తీసుకొన్నా నచ్చిన వారికే ఓటు వేస్తున్నారని సిపిఎం నేత భానురాజా, కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు అభిప్రాయపడ్డారు. నిర్బంధ ఓటింగ్‌తో ఎన్నికల్లో అవినీతి తగ్గుతుందని ప్రజారాజ్యం పార్టీ నేత ఆనం వెంకటరమణారెడ్డి అభిప్రాయపడగా సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి మాత్రం డబ్బుతో ఎన్నికల్లో గెలుస్తామన్న మాట ఒట్టిదన్నారు. డబ్బున్న నేతలనే ప్రజలు ఆదరిస్తున్నారని జడ్పీ ఛైర్మన్ కాకాణి గోవర్ధన్‌రెడ్డి ఆవేదన వ్యక్తం చేశారు. ప్రజలు చైతన్యవంతులు కావడాన్ని రాజకీయనేతలు, ప్రభుత్వాలు ఒప్పుకోవని శాసన మండలి సభ్యుడు విఠపు బాలసుబ్రహ్మణ్యం చెప్పుకొచ్చారు. తాను శాసన మండలి సభ్యుడిగా గెలవడానికి డబ్బు ఖర్చుపెట్టలేదని వివరించారు. అవినీతి వల్ల సమాజంలో ఏదో రోజు విప్లవం లాంటిది మార్పు సంభవిస్తుందని వెంకటగిరి ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ అభిప్రాయపడ్డారు. రాజీవ్ భవన్ నేత కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి అధికార పార్టీలోని నాయకుల్లోని అవినీతిని తూర్పారబట్టారు.

ఆంధ్రజ్యోతి దినపత్రిక ఎండి వేమూరి రాధాకృష్ణ నేతృత్వంలో జరిగిన ఈ కార్యక్రమానికి మంచి స్పందన – సూచనలు వచ్చాయి. ఈ కార్యక్రమాన్ని రత్నం విద్యాసంస్థల అధినేత కె.వి.రత్నం సమర్పించారు.

## వెనక్కు వెళ్లిన విమానాశ్రయం!

నెల్లూరులో విమానాశ్రయ ప్రతిపాదన ఎప్పటికప్పుడు వెనక్కు పోతుంది. వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముఖ్యమంత్రిగా వుండగా దామవరం వద్ద విమానాశ్రయ నిర్మాణానికి మహారాష్ట్ర ఎయిర్‌పోర్ట్ డెవలప్‌మెంట్ కంపెనీతో రాష్ట్ర ప్రభుత్వం ఎంఓయూ చేసుకొంది. కానీ మూడేళ్లుగా ఇక్కడ చిన్నపాటి పని కూడా ఆ కంపెనీ చేయకపోవడంతో ప్రభుత్వం ఈ ఒప్పందాన్ని 22వ తేదీ రద్దు చేసుకొంది. మళ్లీ విమానాశ్రయ ప్రతిపాదన రూపుదిద్దుకోను ఎన్నాళ్లు పడుతుందో ఏమో?

## కమిషనర్‌కు షోకాజ్ నోటీసు

నెల్లూరు కార్పొరేషన్ కమిషనర్ టిఎస్ఆర్ ఆంజనేయులుకు కలెక్టర్ రాంగోపాల్ షోకాజ్ నోటీసు జారీ చేశారు. నగరంలోని ఓటర్ల జాబితాలోనికి ఫోటోలు సేకరించడంలో వైఫల్యానికి కమిషనర్ బాధ్యుడంటూ ఈ నోటీసు జారీ అయ్యింది. నెల్లూరు సిటీ, రూరల్ నియోజకవర్గాల ఓటర్ల లిస్టులలో 25 శాతం మందికి ఫోటోలు లేవు. వాటిని ఈ నెలాఖరుకు స్వీకరించకపోతే వారి ఓట్లు తొలగించక తప్పదు. చూడాలి నోటీసు తర్వాత కమిషనర్ గారు ఎలా పని చేస్తారో?

## జగన్‌ను కలసిన విష్ణు!

అల్లూరు మాజీ ఎమ్మెల్యే కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి నేతృత్వంలోని ప్రతినిధి బృందం 22వ తేదీ హైదరాబాద్‌లో కడప ఎమ్పీ జగన్మోహన్‌రెడ్డిని కలిసింది. కావలిలో స్వర్గీయ కలికి యానాదిరెడ్డి, వైఎస్ రాజశేఖర్‌రెడ్డిల విగ్రహాల ఆవిష్కరణలకు రమ్మని ఆహ్వానించింది. ఓదార్పు యాత్రలో భాగంగా జిల్లాకు వచ్చిన సమయంలో ఈ ఆవిష్కరణల్లో పాల్గొంటానని జగన్ చెప్పారట. ఈ ప్రతినిధి బృందంలో మాజీ మునిసిపల్ ఛైర్మన్ గ్రంధి యానాది శెట్టి, దామిశెట్టి పూర్ణచంద్ర తదితరులు పాల్గొన్నారు.

## శ్రీకృష్ణదేవరాయలు పట్టాభిషేక ఉత్సవాలు!

విజయనగర సామ్రాజ్యాధినేత శ్రీకృష్ణదేవరాయల పట్టాభిషేకం జరిగి 500 సంవత్సరాలు అయిన సందర్భంగా జూలై 10, 11 తేదీల్లో ఆయన సామ్రాజ్యంలో ఒకప్పుడు భాగమైన ఉదయగిరిలో ఉత్సవాలు ప్రభుత్వ నేతృత్వంలో జరుపనున్నారు. ఈ సందర్భంగా ప్రత్యేక సాంస్కృతిక కార్యక్రమాలను మేకపాటి రాజమోహన్‌రెడ్డి ఇంజనీరింగ్ కళాశాలలో నిర్వహిస్తారు. ఉదయగిరిలో శ్రీకృష్ణదేవరాయలు నిర్మించిన శ్రీకృష్ణ మందిరం, కళ్యాణ మండపం, రంగనాయకులస్వామి ఆలయం, వల్లభరాయుని ఆలయం, దుర్గం కోటను ప్రజలు సందర్శించేందుకు సిద్ధంచేసి ఉంచుతారు.

## ట్రాఫిక్ కానిస్టేబుళ్లపై బదలీ వేటు

ట్రాఫిక్ నడతను పట్టించుకోకుండా బాతాఖానీలో వుండిన ఏడు మంది కానిస్టేబుళ్లపై ఎస్పీ దామోదర్ బదలీ వేటు వేశారు. మద్రాస్ బస్టాండ్ నుండి ఆచారివీధి వరకు వన్‌వే చేశారు ఎస్పీ గారు. కానీ ఆయన స్వయంగా 22వ తేదీ కలక్టరేట్‌కు వచ్చిన సమయంలో నిబంధనలకు నీళ్లు వదలి టీ అంగడి దగ్గర వుండిన కానిస్టేబుళ్లు వెంకటేశ్వర్లు, వినోద్, పి.శ్రావణ్‌కుమార్, జి.రామచంద్రయ్య, మల్లికార్జున, సత్యనారాయణ, వేణుగోపాల్‌లను బదలీ చేశారు. నగరంలోని మెజార్టీ ట్రాఫిక్ పాయింట్లలో ఇదే తీరులో ట్రాఫిక్ పోలీసులు డ్యూటీ చేస్తుంటారు. ఎస్పీ సాదాసీదాగా వెళ్లి చూస్తే ఈ విషయాలు తెలుస్తాయి.

## వెంగమాంబ పేరంటాలు!

దుత్తలూరు మండలం నర్రవాడ గ్రామంలోని వెంగమాంబ పేరంటాలు దేవస్థానంలో బ్రహ్మోత్సవాలు జూన్ 27వ తేదీ నుంచి జూలై 1వ తేదీ వరకు జరుగుతాయి. 27వ తేదీ నిలువు, సంతానం లేనివారు వరపడుట, 28, 29 తేదీల్లో గ్రామోత్సవం జరుగుతుంది. 30వ తేదీ కళ్యాణోత్సవం,

కొరవ 14వ పేజీలో

మూడు రోజులు

# బ్లాక్ టిక్కెట్ల హవా!

నెల్లూరు థియేటర్లలలో నడుస్తున్న తంతు ఇదే.



థియేటర్ వద్ద టిక్కెట్లు దొరకక ప్రేక్షకుల నిస్సహాయత.

నెల్లూరు నగరంలో పేరు ప్రతిష్టలు గాంచిన సినిమా థియేటర్లలోనూ క్రేజున్న సినిమా విడుదలైన వరుస మూడు రోజులపాటు బ్లాక్ టిక్కెట్ల హవా నడుస్తుంది. ఈ వ్యవహారానికి సూత్రధారులు సినిమా హాల్‌లో పనిచేసే సిబ్బంది కావడం గమనార్హం. నగరంలోని సినిమా థియేటర్లలో ఎక్కువ శాతం ఒకరి యాజమాన్యం క్రిందనే వున్నాయి. ఇటీవల కట్టిన రెండు మల్టీప్లెక్స్ థియేటర్లు, దర్గామిట్టలోని ఎన్నార్ సినీ విలాస్‌ను మాత్రం వాటి యజమానులే సొంతంగా నిర్వహించుకొంటున్నారు. దీనివల్ల కాస్త అంచనాలున్న సినిమా విడుదలవుతున్నప్పుడు అడ్వాన్స్ బుకింగ్ పేరిట సినిమా విడుదలకు ముందు రోజే హైక్లాస్, అప్పర్ మిడిల్ క్లాస్ టిక్కెట్లు ఇచ్చేస్తున్నారు. వాస్తవానికి ఈ టిక్కెట్లు సామాన్య ప్రేక్షకులు చాలా తక్కువ మంది థియేటర్లలోని బుకింగ్ కౌంటర్లలో ఇచ్చే సమయంలో వెళ్లి కొనుగోలు చేస్తున్నారు. మిగతా టిక్కెట్లను థియేటర్లలోని సిబ్బంది, వారి అనుకూల వ్యక్తులు బుకింగ్ మొదలు పెట్టిన గంటలోనే కొనుగోలు చేసిపారేస్తున్నారు. దీనివల్ల శుక్రవారం విడుదలయ్యే పెద్ద హీరోలతోపాటు కాస్త క్రేజున్న సినిమాలకు శని, ఆదివారాల్లో బుకింగ్‌లలో టిక్కెట్లు ఇవ్వడం లేదు. అడిగిన వారికి అడ్వాన్స్ బుకింగ్ అయిపోయాయని సమాధానం చెబుతున్నారు. కాని హాళ్ల వద్ద కొందరు వ్యక్తులు వందల సంఖ్యలో టిక్కెట్లు చేత పట్టుకొని 50రూపాయల టిక్కెట్ 150 రూపాయలు, 25 రూపాయల టిక్కెట్ 100 రూపాయలుగా యదేచ్ఛగా అమ్ముతున్నారు. సినిమా హాళ్ల ప్రాంగణంలో నిలబడి వీరు బ్లాక్ టిక్కెట్లు అమ్ముతున్నా అడిగేనాథుడే లేదు. జనం సహజంగా శని, ఆదివారాల్లో సినిమాలకు వెళ్లను ఆసక్తి ప్రదర్శిస్తారు. హాల్ దగ్గరకు వెళ్లిన ప్రేక్షకులు తిరిగి వచ్చే ప్రసక్తి లేకపోవడంతో టిక్కెట్లు బ్లాక్ చేసే వాళ్లు బాగా సంపాదించుకొంటున్నారు. ఈ మధ్య విడుదలైన సింహా, విలన్, పంచాక్షరి, వేదం, గోలీమార్, డార్లింగ్ చిత్రాల టిక్కెట్ల విషయంలో మొదటి మూడురోజులు ఈ తంతు కొనసాగింది. మూడురోజుల్లో ఒక చిత్రం కనీసంగా విడుదల చేసే రెండు థియేటర్లలో 24 షోలు పడుతుంది. ఈ లెక్కన సిబ్బంది, బ్లాక్ టిక్కెట్లు అమ్మేవారి ఆదాయం ఎంతమేర వుంటుందో అర్థం చేసుకోవచ్చు. నెల్లూరు ప్రేక్షకులకు వినోదానికి సినిమా మినహా మరో గత్యంతరం లేదు. దాన్ని కూడా మొదటి మూడు రోజులు మూడింతలు టిక్కెట్ ధర అధికంగా చెల్లించి చూడాలా? థియేటర్ యాజమాన్యాలు ఈ విషయంపై దృష్టి సారించకపోతే ఎలా?

# చికెన్ అమ్మకాలలో రొంబా మోసం!



నోరూరించే చికెన్‌లోనూ చేతివాటం చూపుతున్న వ్యాపారులు.

మోసం రాజ్యమేలుతున్న రోజులివి. ఇక్కడ... అక్కడ... ఎక్కడ చూసినా మోసాలే. ప్రజలను తెలివిగా బురిడీ కొట్టించి అనతికాలంలోనే పెద్ద మనుషులైపోవడం రివాజుగా మారింది. నగరంలో చికెన్ వ్యాపారం చేసే వారు ఈ మధ్య కోడి మాంసం రేటు విపరీతంగా పెరిగిన నేపథ్యంలో తక్కువ రకం మాంసాన్ని ఎక్కువ ధరకు అమ్మేస్తూ లక్షాధికారులై పోతున్నారు. చికెన్‌లో బ్రాయిలర్, లేయర్ రకాలున్నాయి. ప్రస్తుతం మార్కెట్ ధరల ప్రకారం కిలో బ్రాయిలర్ కోడిని 86 రూపాయలకు అమ్ముతుండగా దీని మాంసాన్ని కిలో 140 రూపాయలకు మార్కెట్‌లో విక్రయిస్తున్నారు. బ్రాయిలర్ కోడి మాంసాన్ని తోలుతీసి స్కిన్‌లెస్ అంటూ కిలో 164 రూపాయలకు అమ్ముతున్నారు. లేయర్ కోడిని కిలో 54 రూపాయలకు మాంసాన్ని 89రూపాయలకు అమ్ముతున్నారు. నెల్లూరులో పెద్దపెద్ద కోళ్ల మాంసం దుకాణ నిర్వాహకులు సైతం లేయర్ కోళ్ల మాంసాన్ని తోలుతీసి స్కిన్‌లెస్ మాంసం రేటుకు అమ్మేస్తున్నారు. పచ్చిమాంసంగా బ్రాయిలర్‌కు లేయర్‌కు తేడాను సామాన్యులు గుర్తుపట్టలేరు. కూర కుక్కర్‌లో ఉడికిన తర్వాత లేయర్ మాంసం గట్టిగా రుచి పచి లేకుండా వుంటుంది. అదే బ్రాయిలర్ అయితే మెత్తగా రుచిగా వుంటుంది. కిలో లేయర్ కోడి మాంసాన్ని స్కిన్‌లెస్‌గా అమ్మితే 110 రూపాయలు విక్రేత లాభంగా పొందుతాడు. ఈ మొత్తం వినియోగదారుడు నష్టపోతాడు. పెళ్లిళ్లు, పార్టీలలోనూ ఇదే ఎత్తుగడతో కేటరింగ్ నిర్వాహకులు సైతం నిలువునా మోసం చేసేస్తున్నారు. ఈ మోసాలను మాంసం దుకాణాల దగ్గరకు వెళ్లి కార్పొరేషన్‌లోని శానిటరీ ఇన్స్‌పెక్టర్లు అరికట్టాలి. కాని వీరంతా విక్రేతల వద్ద ప్రతిరోజు చికెన్ లెగ్‌పీసులు, బోన్‌లెస్ మాంసం, లివర్లు కేజీలు కేజీలు పట్టుకెళ్తూ పట్టించుకోవడమే లేదు. కోడిమాంసం కొనే ముందు, వండాక కూడా విక్రేతలను జనం ప్రశ్నించడం మొదలుపెడితేగాని అటు డబ్బుతోపాటు మంచి మాంసం కూడ తినలేని వ్యక్తులుగానే మిగిలిపోవాల్సి వస్తుంది.

## రోడ్ల మరమ్మత్తులకు రూ.22 కోట్లు!

గత మాసంలో సంభవించిన లైలా తుఫాను కారణంగా దెబ్బతిన్న ఆర్‌అండ్‌బి రోడ్ల మరమ్మత్తులకు రాష్ట్ర ప్రభుత్వం 22 కోట్ల రూపాయలు విడుదల చేసినట్లు పురపాలక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి తెలియజేశారు. జిల్లాలోని 27 ప్రాంతాలల్లో 220 కిలో మీటర్ల పొడవునా దెబ్బతిన్న ఈ రోడ్ల తాత్కాలిక మరమ్మత్తులకు సైక్లోన్ డ్యామేజి



రామనారాయణ రెడ్డి వెల్లడి.

రిలీఫ్ ఫండ్ ద్వారా ఈ మొత్తాన్ని విడుదల చేసినట్లు చెప్పుకొచ్చారు. నెల్లూరు డివిజన్ పరిధిలో 10 రహదారులకు 7.80 కోట్లు, గూడూరు డివిజన్‌లో 8 రహదారులకు 7.20కోట్లు, కావలి డివిజన్‌లో 9 రహదారులకు 7కోట్ల రూపాయల పనులకు తక్షణం టెండర్ల ప్రక్రియ ప్రారంభించి జూలై మాసాంతంలోగా పనులు పూర్తి చేయాలని రామనారాయణ రెడ్డి రోడ్లు భవనాలశాఖాధికారులను ఆదేశించారు.

## బడిబాట బూటకం

విద్యాశాఖ కార్యదర్శికి నిజాయితీగా చెప్పిన డిప్యూటీ డిఇఓ

బడి మానేసిన పిల్లలను, బడి బయట వివిధ పనులు చేసుకొంటున్న చిన్నారులను బడిలో చేర్పించేందుకు, వారికి చదువు చెప్పించేందుకు ప్రభుత్వం ప్రతి ఏడాది బడిబాట కార్యక్రమాన్ని నిర్వహిస్తోంది. బడిబాటను ప్రతిష్టాత్మకంగా నిర్వహిస్తున్నట్లు చెప్తున్నా ఆచరణలో మాత్రం అది విఫలమవుతూనే వుంది.



ఈ ప్రదర్శనలు ఎవరినుద్దరించను?

జిల్లాలో బడిబాట అధికారుల ఆర్భాటానికి, ప్రచారానికి తప్ప నిజంగా బడిబయట వుండే పిల్లలు బడిబాట పట్టడానికి ఉపయోగపడడం లేదు. అధికారులు ప్రతి సంవత్సరం బడి మానేసిన పిల్లలను తిరిగి బడిలో చేర్పించామంటూ తప్పుడు లెక్కలు చెప్తూ కార్యక్రమం విజయవంతమైందని చంకలు గుద్దుకోవడం మినహా నిజంగా ఎంతమంది పిల్లలు బడిబాట పడుతున్నారనే దానిపై సమాధానం వుండడం లేదు.

రాష్ట్ర విద్యాశాఖ కార్యదర్శి సాంబశివరావు ఇటీవల జిల్లాకు వచ్చిన సందర్భంగా ఎంఇఓలతో సమావేశం నిర్వహించిన సందర్భంలో జిల్లా ఉపవిద్యాశాఖాధికారి బంగారయ్య చేసిన వ్యాఖ్యలు సంచలనం కల్గించాయి. విద్యాశాఖ కార్యదర్శికి పలువురు ఎంఇఓలు బడిబాట కార్యక్రమాన్ని, బడి బయట వుండే పిల్లల గురించి వివరిస్తుండగా బంగారయ్య లేచి ఏంలేదు సార్, ఎంఇఓలంతా అబద్ధం చెప్తున్నారు. బడిబాట కార్యక్రమం సక్రమంగా జరగడం లేదు. ఇది అందరికి తెలుసు. అయినా అబద్ధాలు చెప్తున్నారు. ఐదువేల మంది పిల్లలు మాత్రమే బడిబయట వున్నారని చెప్పడం అబద్ధం, ఒక్క నెల్లూరు నగరంలోనే బంగారంగళ్లు, హోటళ్లు ఇతర షాపుల వద్ద ఐదు వేల మంది వుంటారని, జిల్లావ్యాప్తంగా 50వేల మంది వుంటారనడంతో సాంబశివరావుతోసహా అందరూ బంగారయ్య మాటలతో అవాక్కయ్యారు. ఈ అధికారి మాటలు అక్షర సత్యం.

## డిఇఓను చులకన చేస్తున్న రాజీవ్ విద్యామిషన్!

జిల్లా విద్యాశాఖలో వర్గపోరు కొనసాగుతూనే వుంది. గతంలో ఇది విద్యాశాఖలోని సిబ్బంది మధ్యే వుండగా ఇప్పుడు రాజీవ్ విద్యామిషన్‌కు ప్రాకింది. విద్యాశాఖకు సంబంధించినంత వరకు అన్ని విభాగాలపైనా డిఇఓకు అధికారం, ఆయనే సర్వాధికారి. అయితే రాజీవ్ విద్యామిషన్ పిఓగా వచ్చిన రమేష్‌కుమార్ డిఇఓ బాలకాశయ్యను లెక్క చేయకుండా నిర్లక్ష్యంగా వ్యవహరించడం వివాదాస్పదమౌతుంది. గతంలో పనిచేసిన అశోక్‌రెడ్డి తదితర అధికారులందరూ డిఇఓలతో సఖ్యతగా వుంటూ పరస్పర సహకారంతో పని చేసినవారే. రమేష్‌కుమార్ మాత్రం అహంకారపూరితంగా వ్యవహరిస్తూ జిల్లా విద్యాశాఖ అధికారి అన్న లెక్క లేకుండా తోటి సిబ్బంది ముందు హేళనా పూర్వకంగా మాట్లాడడం, వ్యాఖ్యలు చేస్తుండడం పట్ల ఆ

### పిఓ రమేష్‌నే కారకుడు

శాఖలోని సిబ్బందే మండిపడుతున్నారు. మొదటి నుంచి వివాదాస్పదుడిగా పేరు పొందిన రమేష్‌కుమార్ కొన్నాళ్లు నెల్లూరు భూగర్భ జలశాఖలోను, బిసి కార్పొరేషన్ ఇడిగాను పని చేశారు. ఆ తర్వాత కడపలో పని చేస్తుండగా అక్కడి అధికారులకు ఆయన ప్రవర్తన నచ్చక ప్రభుత్వానికి సరెండర్ చేశారు. ఇటీవల తిరిగి రాజీవ్ విద్యామిషన్ పిఓగా బాధ్యతలు చేపట్టపోగా కలెక్టర్ రాంగోపాల్‌కు ఇతని ప్రవర్తన తెలిసి జాయిన్ చేసుకొనేందుకు సమ్మతించ లేదు. తర్వాత ఎలాగోలా బాధ్యతలు చేపట్టినా ఆయన అధికారాలకు కలెక్టర్ కోత పెట్టాడు. ఇన్ని చేసినా రమేష్‌కుమార్‌లో మార్పు రానట్లుంది. బడిబాట కార్యక్రమానికి సంబంధించి ర్యాలీ నిర్వహించినప్పుడు డిఇఓ బాలకాశయ్య వచ్చినా ఆయన కంటే తక్కువ క్యాడర్ కలిగిన రమేష్ కుమార్ చాలా ఆలస్యంగా రావడంతో డిఇఓ అసహనం వ్యక్తం చేసినట్లు తెలిసింది. కావాలని ఆర్‌విఎం పిఓ డిఇఓ పట్ల అలా వ్యవహరిస్తున్నారని విద్యాశాఖ సిబ్బంది వ్యాఖ్యానిస్తున్నారు.

# నెల్లూరు – ముంబాయి రోడ్డు పూర్తయ్యేదెప్పుడు?

అధికారుల నిర్లక్ష్యం, ప్రజాప్రతినిధుల ఉదాసీనవైఖరి కారణంగా నెల్లూరు – ముంబాయి రోడ్డు నిర్మాణం నత్తనడకన సాగుతుంది. మొత్తం ఎనిమిది ప్యాకేజీలుగా విభజించి ఈ రోడ్డు నిర్మాణం పూర్తి చేసేందుకు అధికారులు ప్రణాళికలు రూపొందించారు. నిర్ణీత కాలవ్యవధి పూర్తికాబడినప్పటికీ నిర్మాణం మాత్రం అసంపూర్తిగానే మిగిలిపోయింది. రోడ్లు, భవనాల శాఖ ఆధ్వర్యంలో చేపట్టిన ఈ రహదారి నిర్మాణం పూర్తికాకపోవడంతో వాహనాల రాకపోకలకు తీవ్ర ఇబ్బందికరంగా పరిణమించింది. పనులు దక్కించుకున్న కంపెనీల ప్రతినిధులు సైతం వీటిపై ప్రత్యేక దృష్టి సారించడం లేదు.

నెల్లూరు వెంకటేశ్వరపురం ఫ్లైఓవర్ బ్రిడ్జి నుంచి ఆత్మకూరు వరకు నెల్లూరు – ముంబాయి రోడ్డు పనులు పూర్తి చేయాల్సి వుంది. తొమ్మిది కోట్ల 70 లక్షల రూపాయల వ్యయంతో చేపట్టే ఈ పనులను

## నత్తనడకన పనులు

మూడు కంపెనీలు టెండరు ద్వారా దక్కించుకున్నాయి. ఈ సంవత్సరం ఫిబ్రవరి 10వ తేది టెండర్లు ఖరారు కాబడ్డాయి. ఎం.ఆర్.కె.ఆర్ కన్‌స్ట్రక్షన్స్, బి.వి.ఎస్.ఆర్ కన్‌స్ట్రక్షన్స్, పంకజ్‌రెడ్డి అనే కాంట్రాక్టర్లకు ఈ పనులు కేటాయించబడ్డాయి. పనులు దక్కించుకున్న కంపెనీలు కొంత మేర పనులు పూర్తిచేసి మిగిలిన పనులు పూర్తిచేయలేక పోతున్నాయి. నెల్లూరు – ముంబాయి రహదారిపై నిత్యం బళ్లారి నుంచి ఇనుప ఖనిజం తీసుకొచ్చే వాహనాలు అధికసంఖ్యలో రాకపోకలు సాగిస్తున్నాయి.

ఈ భారీ వాహనాలు తిరగడం కారణంగా రహదారి బాగా దెబ్బతిని గుంటలు పడ్డాయి. ఈ రహదారిని తిరిగి పునర్నిర్మించేందుకు రోడ్లు, భవనాల శాఖ అధికారులు ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపారు. పనులు చేపట్టేందుకు రాష్ట్ర ప్రభుత్వం అనుమతిస్తూ టెండర్లను ఆన్‌లైన్ ద్వారా స్వీకరించాలని ఆదేశించడం జరిగింది. దీంతో ఆన్‌లైన్‌లో వచ్చిన టెండర్లను పరిశీలించి హైదరాబాద్‌లో ఖరారు చేశారు. నిబంధనల ప్రకారం మే నెలాఖరుకు రోడ్డు నిర్మాణ పనులను పూర్తి చేయాలి. అయితే నిర్మాణ పనుల్ని దక్కించుకున్న కంపెనీలు నత్తనడకన పనులు చేస్తున్నాయి. ఒక్కో కంపెనీ రెండు ప్యాకేజీల క్రింద పనులు పూర్తిచేసి మిగిలిన ప్యాకేజి పనులు చేయడం లేదు.

## పర్యవేక్షణ లోపం

నెల్లూరు – ముంబాయి రోడ్డు నిర్మాణ పనులను పర్యవేక్షించడంలో రోడ్లు, భవనాల శాఖ అధికారులు దృష్టి పెట్టడం లేదు. నెల్లూరు, కావలి ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లు ఈ పనులను పర్యవేక్షణ చేయాల్సి వుంటుంది. అయితే ఈ విభాగానికి చెందిన ఇద్దరు ఇ.ఇలు ఈ పనివైపే దృష్టి కేంద్రీకరించడం లేదు. దీంతో పనులలో నాణ్యతా ప్రమాణాలు లోపిస్తున్నాయి. సిమెంటు, మెటల్ నాసిరకంగా వుంటున్నాయి. తొలుత సిమెంటు కలిపిన మెటల్‌ను వేసి దీనిపై తారు కలిపిన కంకరను వేస్తున్నారు. రోడ్డు వేసిన మరుసటి రోజే వాహనాల తాకిడికి నాణ్యతా లోపాలు బయటపడుతున్నాయి.

రోడ్డు నిర్మాణ సమయంలో కాంట్రాక్టు పొందిన కంపెనీ సిబ్బంది, ఆర్అండ్‌బి సిబ్బంది మాత్రమే వుంటున్నారు. రోడ్డు నిర్మాణ పనులలో నాణ్యతా ప్రమాణాలు లోపించడం కారణంగా ఇవి కొద్ది నెలలకే శిథిలావస్థకు చేరుకునే ప్రమాదం లేకపోలేదు. ఒక ప్రక్క నిర్మాణ పనులు జరగడం, మరో ప్రక్క భారీ వాహనాలు ప్రయాణిస్తుండడం, వర్షాలు కురవడం వలన కూడా పనులకు కొంతమేర ఆటంకం కలుగుతుంది.



మెటల్‌రోడ్డుగా మారిపోయిన నెల్లూరు – ముంబాయి రోడ్డు.

వెంకటేశ్వరపురం నుంచి ఆత్మకూరు వరకు చేపట్టాల్సిన పనులు సంగం దాటలేదు. బుచ్చి, సంగం మధ్యలోనే పనులు జరుగుతున్నాయి. రోడ్లు, భవనాల శాఖకు చెందిన అధికారులు కాంట్రాక్టు పనులు పొందిన కంపెనీ ప్రతినిధులతో కుమ్మక్కైయ్యారన్న ఆరోపణలు వున్నాయి.

కోట్ల రూపాయల వ్యయంతో చేపడుతున్న పనులను ఉద్దేశపూర్వకంగా అధికారులు పర్యవేక్షించడం లేదన్న ఆరోపణలు ఎదుర్కొంటున్నారు. ఈ రహదారిపై అధికారులు, ఎమ్మెల్యేలకు చెందిన వాహనాలు ప్రయాణిస్తుంటాయి. ఒక్కరు కూడా పనుల నాణ్యత గురించి పరిశీలన చేయడం లేదంటే ఆశ్చర్యపోక తప్పదు. రోడ్లు, భవనాల శాఖ అధికారులు, కాంట్రాక్టర్లు కలిసి ఈ రోడ్డును ఎప్పటికి పూర్తిచేస్తారో వేచి చూడాల్సిందే.

---



కొత్తూరులో ఒకేచోట వెలసిన పలు సెల్ టవర్లు.

● సెల్ టవర్ల ఏర్పాటులో

# కార్యదర్శి చేతివాటం!

ఏ ప్రాంతంలోనైనా సెల్‌టవర్ల నిర్మాణం చేపట్టాలంటే పర్యావరణ పరిరక్షణ అధికారుల అనుమతితోపాటు పంచాయితీ పాలకవర్గం అనుమతి కూడా తప్పనిసరి. వీరి అనుమతితోనే సెల్‌టవర్ల నిర్మాణం చేపట్టాల్సి వుంటుంది. అయితే గ్రామపంచాయితీ పాలకవర్గం తీర్మానం, అనుమతి లేకుండానే సెల్‌టవర్ల నిర్మాణానికి గ్రామపంచాయితీ కార్యదర్శి అనుమతి జారీ చేసిన వైనం ఆలస్యంగా వెలుగులోకి వచ్చింది. నెల్లూరు రూరల్ మండలం కొత్తూరు గ్రామ పంచాయితీ పరిధిలో ఇటీవల ఆరు కంపెనీలకు సంబంధించిన సెల్ టవర్ల నిర్మాణం జరిగింది.

నిబంధనల ప్రకారం సెల్‌టవర్లను నివాసిత ప్రాంతాలకు దూరంగా ఏర్పాటు చేయాల్సి వుంటుంది. సంబంధిత సెల్‌కంపెనీ ప్రతినిధులు సెల్‌టవర్ల ఏర్పాటుకు ముందుగా గ్రామపంచాయితీ అనుమతి కోసం దరఖాస్తు చేసుకోవాలి. పంచాయితీ పాలకవర్గం సమావేశంలో దానిపై చర్చించి సెల్‌టవర్ల నిర్మాణం కోసం అనుమతి ఇవ్వాల్సి వుంటుంది. కొత్తూరు గ్రామపంచాయితీ కార్యదర్శి అధికార దుర్వినియోగానికి పాల్పడి పాలకవర్గం ఆమోదం లేకుండానే సెల్‌టవర్ల ఏర్పాటుకు అనుమతి జారీ చేశాడు. ఇందుకు ప్రతిఫలంగా ఆయా కంపెనీలు భారీ స్థాయిలో నగదు ముట్టజెప్పినట్లు తెలిసింది.

సెల్‌టవర్లు ఏర్పాటుచేసే ప్రాంతం నివాసాల మధ్య వుండడంతో స్థానికులు అభ్యంతరం వ్యక్తం చేసినా ఎవరు పట్టించుకోలేదు. సెల్ టవర్ల నిర్మాణానికి గ్రామ పంచాయితీ అనుమతి వుందని చెప్పి నిర్మాణాలు సాగిస్తున్నారు. గ్రామ పంచాయితీ పాలకవర్గం వున్నప్పటికి కనీస సమాచారం కూడా అందించకుండా పంచాయితీ కార్యదర్శి ఏకపక్ష నిర్ణయాలు తీసుకుంటున్నారు. ఫలితంగా పంచాయితీపై ప్రజలలో చులకన భావం ఏర్పడడంతోపాటు వేలాది రూపాయల ఆదాయం పంచాయితీ కోల్పోవాల్సి వస్తుంది. ఒక్కో సెల్ టవర్ నిర్మాణం కోసం 50వేల నుంచి లక్షరూపాలయ వరకు గ్రామపంచాయితీ కార్యదర్శి వసూలు చేసినట్లు ఆరోపణలున్నాయి.

## గతంలోనూ ఆరోపణలు

కొత్తూరు గ్రామపంచాయితీ కార్యదర్శి నరేంద్రపై మొదటి నుంచి పలు ఆరోపణలు వున్నాయి. ఇతను గతంలో సూళ్లూరుపేట గ్రామ పంచాయితీ కార్యదర్శిగా పని చేసిన సమయంలో నిధులు దుర్వినియోగానికి పాల్పడినట్లు ఆరోపణలు వెల్లువెత్తాయి. ఈ క్రమంలో సూళ్లూరుపేట నుంచి కొత్తూరు గ్రామపంచాయితీకి బదలీ చేయించుకున్నాడు. ఈ పంచాయితీ నెల్లూరు నగరానికి శివారున వుండడంతో, స్టాంపు డ్యూటీ రూపంలో లక్షలాది రూపాయలు సమకూరే విషయాన్ని తెలుసుకున్న ఇతను వున్నతాధికారులను మచ్చిక చేసుకొని కావాలనే ఇక్కడ పోస్టింగ్ వేయించుకొన్నాడు.

కొత్తూరు పంచాయితీ సర్పంచ్ మహిళ కావడం వలన ఆమె పెద్దగా పంచాయితీ వ్యవహారాల గురించి పట్టించుకోవడం లేదు. దీనిని ఆసరా చేసుకున్న కార్యదర్శి మొత్తం తానేనన్న విధంగా వ్యవహరిస్తూ చక్రం తిప్పుతున్నాడు. ఈ పంచాయితీ పరిధిలో ఇటీవల కాలంలో చాలా లే – అవుట్లు ఏర్పాటు జరిగాయి. భూముల ధరలు పెరగడం, రిజిస్ట్రేషన్లు పూపందుకోవడంతో లక్షలాది రూపాయలు స్టాంపుడ్యూటీ రూపంలో పంచాయితీ ఖాతాకు వచ్చి చేరాయి. ఈ నిధుల్లో కూడా కార్యదర్శి కొంతమేర చేతివాటం ప్రదర్శిస్తున్నాడు. ఈ పంచాయితీకి ఇద్దరు గుమస్తాలు అవసరం లేకపోయినప్పటికి కావాలనే నియమించుకున్నాడు.

బోగోలు గ్రామపంచాయితీ కార్యాలయంలో గుమస్తాను కొత్తూరుకు బదలీ చేయించుకున్నాడు. బోగోలు పంచాయితీ గుమస్తాను బదలీ చేస్తే ఇబ్బంది పడతారన్న విషయం జిల్లా పంచాయితీ అధికారులకు తెలిసినా కూడా ఒత్తిళ్లకు తలొగ్గి కొత్తూరుకు బదలీ చేశారు. దీనిని బట్టి కొత్తూరు పంచాయితీ కార్యదర్శి హవా ఏవిధంగా కొనసాగుతుందో అర్థం చేసుకోవచ్చు. మొత్తం మీద కొత్తూరు గ్రామ పంచాయితీ పరిధిలో సెల్‌టవర్ల నిర్మాణం వివాదాస్పదంగా మారింది. ఉన్నతాధికారులు స్పందించి వాటి నిర్మాణంపై విచారణ జరిపితే వాస్తవాలు బహిర్గతమవుతాయి.



తెలుగుదేశం పార్టీ జిల్లా నూతన కార్యవర్గాన్ని పరిచయం చేస్తున్న ఆ పార్టీ జిల్లా అధ్యక్షుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి.




తమ ఇళ్లను అక్రమంగా కూల్చివేసారంటూ కలెక్టరేట్ వద్ద సిపిఎం పార్టీ నేతృత్వంలో ధర్నా చేస్తున్న కల్లూరుపల్లివాసులు.



బాలకృష్ణ జన్మదినోత్సవ వారోత్సవాల సందర్భంగా జరిగిన ఉచితవైద్య శిబిరంలో తెలుగునేతలు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, డాక్టర్ శివప్రసాద్, డాక్టర్ వెంకటరమణారెడ్డి, టి.రమేష్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీనివాసులురెడ్డి.



ఒలింపిక్ డేను పురస్కరించుకొని నగరంలో ఔత్సాహిక క్రీడాకారుల పరుగు.

# మండలాల్లో వాతావరణ కేంద్రాలు!

**ఉపద్రవాలు తెలుసుకొనే వీలు**

జిల్లాలోని అన్ని మండలాల్లో వాతావరణ కేంద్రాలను ఏర్పాటు చేసేందుకు ప్రభుత్వం గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. తుఫాను, భారీ వర్షాల రాకను ముందుగానే తెలుసుకొనేందుకు అన్ని మండలాలకు వీలవుతుంది. ఇప్పటి వరకు విశాఖపట్నం, చెన్నై వాతావరణ కేంద్రాల నుంచి జిల్లా అధికార యంత్రాంగానికి సమాచారం అందేది. దీంతో అప్రమత్తమై తీరప్రాంతాలు, లోతట్టు ప్రాంతాల వారిని సురక్షిత ప్రాంతాలకు తరలిస్తుండినారు. ఇప్పుడు మండలాల్లో వీటిని ఏర్పాటు చేయనుండడంతో ముందు జాగ్రత్త చర్యలు తీసుకోవడంతోపాటు వర్షపాతం, ఉష్ణోగ్రత, గాలి వేగం, దిశ, తేమశాతం తదితర విషయాలను ఎప్పటికప్పుడు తెలుసుకోవచ్చు. రైతులకూ ఈ కేంద్రాల వలన మేలు జరుగనుంది. వాతావరణ స్థితిగతులను బట్టి పంటల సాగుకు అవసరమైన సమాచారం లభించనుంది. ముఖ్యమంత్రి కార్యాలయం నుంచి రెవెన్యూ అధికారులకు సమాచారం అందడంతో కేంద్రాల ఏర్పాటుకు అధికారులు చర్యలు చేపట్టారు. తొలుత తీరప్రాంతాల్లో, వరద ప్రభావిత మండలాల్లో ఈ వాతావరణ కేంద్రాలను ఏర్పాటు చేయనున్నారు. దశల వారీగా అన్ని మండల కేంద్రాల్లోనూ ఇవి ఏర్పాటు కానున్నాయి.

● చెరువులతో

# భయం... భయం!

వర్షాల కోసం ఎదురు చూస్తున్న రైతులకు తొలకరి జల్లులు ఆనందం కల్గిస్తున్నా కావలి రూరల్ మండలంలోని ఆయకట్టుదారులకు చెరువుల పరిస్థితి ఆందోళన కల్గిస్తోంది. గత వర్షాలకు గండ్లు పడిన చెరువులకు ఇంత వరకు శాశ్వత మరమ్మత్తులు చేపట్టకపోవడమే అందుకు కారణం. వేసవిలో చెరువుల మరమ్మతులు చేపట్టి రైతులకు సాగు నీటి కొరత లేకుండా చూడాల్సిన అధికారులు ఆ దిశగా చర్యలు చేపట్టకపోవడంతో రైతుల పరిస్థితి అగమ్యగోచరంగా మారింది. మండలంలో 21 మైనర్ ఇరిగేషన్ చెరువులు వుండగా, పంచాయితీరాజ్ చెరువులు 7 వున్నాయి. వీటిలో కొన్ని చెరువులకు

**కావలి రూరల్ మండలంలో పరిస్థితిది!**

నాబార్డ్ నిధులతో మూడేళ్లుగా మరమ్మత్తులు చేస్తూనే వున్నారు. నేటికీ అవి పూర్తికాలేదు. వీటిలో ఎనిమిదింటిని రైలు మార్గాలను ఇబ్బంది పెట్టే చెరువులుగా గుర్తించి షుమారు మూడున్నర కోట్లతో ప్రతిపాదనలు పంపి రెండేళ్లయ్యింది. ఇంతవరకు నిధులు మంజూరు కాలేదు. మరమ్మత్తులు జరగకపోవడంతో చెరువులు ఎప్పుడు తెగుతాయోనని రైతులు ఆందోళన చెందుతున్నారు. గతంలో బుడమగుంట, కొత్తపల్లి చెరువులకు గండ్లుపడగా మరికొన్నింటికి తూములు దెబ్బతిన్నాయి. వీటికి తాత్కాలిక మరమ్మత్తులు చేపట్టారు తప్ప శాశ్వత మరమ్మత్తులు లేవు.

# గడ్డకట్టిన సిమెంట్!

**ఇందిరమ్మ ఇళ్ల లబ్ధిదారులకు ఎన్ని కష్టాలు?**

బిల్లుల చెల్లింపులో జాప్యం, అసంపూర్తి నిర్మాణాలు, నిర్మాణం పూర్తయినా పగుళ్లు ఇచ్చిన ఇళ్లు ఇది ఇందిరమ్మ ఇళ్ల లబ్ధిదారులకు ఎదురౌతున్న కష్టాలు. సంగం మండలంలోని లబ్ధిదారులకు ఇప్పుడు కొత్త కష్టం వచ్చింది. వీరికి ప్రభుత్వం సబ్సిడీతో మంజూరు చేసిన సిమెంటు బస్తాలు గడ్డకట్టిపోయాయి. సకాలంలో ఇళ్ల నిర్మాణం జరగకపోవడం, అధికారుల నిర్లక్ష్యం లబ్ధిదారులపాలిట శాపంగా మారింది. రెండేళ్ల క్రిందట మండలంలోని దువ్వూరు గ్రామాన్ని మొదటి విడత ఆదర్శ గ్రామంగా ఎంపిక చేశారు. ఈ మేరకు అవసరమైన సిమెంటును దువ్వూరు పంచాయితీ కార్యాలయంలో నిల్వచేశారు. కొంత మందికి వీటిని సరఫరా చేసిన అధికారులు తర్వాత ఈ సిమెంటు బస్తాల సంగతి పట్టించుకోకపోవడంతో బస్తాల్లోని సిమెంటు గడ్డకట్టిపోయింది. వీర్లగుడిపాడులోనూ ఇదే పరిస్థితి. మొత్తం 320 సిమెంటు బస్తాలు వృధా అయ్యాయి. అధికారుల నిర్లక్ష్యం కారణంగా పేదల పక్కాగృహాలకు వినియోగించాల్సిన సిమెంటు దేనికి పనికి రాకుండా పోయింది.

# ఆత్మకూరులో ఎడాపెడా విద్యుత్‌కోత!

● మండల సభలో ఆగ్రహం వ్యక్తం చేసిన ప్రజాప్రతినిధులు

ఆత్మకూరు ప్రాంతంలో వేళాపాళా లేకుండా విధిస్తున్న విద్యుత్ కోతల వల్ల ప్రజలు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారని ఇటీవల జరిగిన మండల సర్వసభ్య సమావేశంలో పలువురు సభ్యులు ట్రాన్స్‌కో తీరుపై ఆగ్రహం వ్యక్తం చేశారు. మండలాధ్యక్షురాలు చేజర్ల హైమావతమ్మ అధ్యక్షతన జరిగిన సమావేశంలో పలువురు ప్రజాప్రతినిధులు విద్యుత్‌కోతపై అధికారులను నిలదీశారు. సమావేశం ప్రారంభం కాగానే కోఆప్షన్ సభ్యుడు సాబ్జాన్‌ఖాన్ దీనిపై మాట్లాడుతూ అంతులేని విద్యుత్ కోతల వల్ల ప్రజలు తీవ్ర అవస్థలు పడుతున్నారని, జిల్లాలో ఎక్కడాలేని విధంగా రోజుకు 8 గంటలకుపైగా కోత వుందంటూ ఆగ్రహించారు. దీనివల్ల గ్రామాల్లో మంచినీటి సమస్య ఏర్పడుతున్నదన్నారు. ఎంపిటిసి సభ్యులు లక్ష్మీపతి, కొల్లా ఆనంద సుధాకర్‌నాయుడు, శ్రీనివాసులు, నరసయ్యనాయుడు, వెంకటయ్య, నవనీతమ్మ, సర్పంచ్‌లు వేణుగోపాల నాయుడు, వెంకటరత్నాకర్‌రెడ్డి తదితరులు విద్యుత్ సమస్యపై అధికారులను నిలదీయడంతో ట్రాన్స్‌కో ఎఇలు రమేష్, మాధవ్‌రావులు మాట్లాడలేని పరిస్థితి నెలకొంది. పై అధికారుల ఆజ్ఞల మేరకే కోత విధించాల్సి వస్తున్నదని వారు సమాధానం ఇచ్చినా సభ్యులు సంతృప్తి చెందలేదు. ఎంపిడివో బాలిరెడ్డి జోక్యం చేసుకొని విద్యుత్ సమస్యలపై మండల పరిస్థితిని ఉన్నతాధికారులకు తెలియజేస్తామని చెప్పడంతో సభ్యులు శాంతించారు. మొత్తం మీద ఆత్మకూరు పట్టణం, మండలంలోని గ్రామాల్లో వేళాపాళా లేకుండా విధిస్తున్న విద్యుత్ కోతలు ప్రజలను చికాకు పెడుతున్నాయి.



పేద విద్యార్థులకు పుస్తకాలు, యూనిఫాం పంపిణీ చేస్తున్న జడ్పీచైర్మన్ కాకాణి గోవర్ధనరెడ్డి, వైస్‌చైర్మన్ రాజా తదితరులు.

# స్నేహ హస్తం అందించిన ప్రసన్న

నేదురుమల్లి రామ్‌కుమార్‌రెడ్డి ప్రత్యక్ష రాజకీయాలలోకి వస్తే ఆయనతో కలసి నేదురుమల్లి, నల్లపురెడ్డి వర్గాలను కలుపుకొని పార్టీ కోసం పని చేస్తామని కోవూరు శాసనసభ్యుడు నల్లపురెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి వ్యాఖ్యానించారు. కోట గ్రామంలో ఆయన ప్రజలతో ముచ్చటించారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ స్వర్గీయ ఎన్‌టి రామారావు స్థాపించిన తెలుగుదేశం పార్టీని చంద్రబాబునాయుడు కోటీశ్వరులకు తాకట్టు పెడుతున్నాడని విమర్శించారు. పార్టీ కోసం పనిచేసిన వారెం దరో టిడిపిలో వుండగా రాజ్యసభ సీట్లకు కోటీశ్వరుల వైపు మొగ్గు చూపాడని ఆరో

**రామ్‌కుమార్‌తో కలసి పనిచేస్తానని ప్రకటన**

పించారు. ఇప్పటికైనా ఎన్టీఆర్ వారసులైన హరికృష్ణ, బాలకృష్ణ, జూనియర్ ఎన్టీఆర్‌లు కళ్లు తెరచి పార్టీ పగ్గాలు చేపట్టకపోతే ఎన్టీఆర్ ఆత్మ క్షోభిస్తుందన్నారు. ప్రజల శ్రేయస్సు దృష్ట్యా టిడిపి నుంచి ఎమ్మెల్యేగా గెలిచినా దివంగతనేత వైఎస్, ముఖ్య మంత్రి రోశయ్య ద్వారా నిధులు మంజూరు చేయించుకొని నియోజకవర్గ అభివృద్ధికి పాటుపడుతున్నట్లు తెలిపారు. అనంతరం ఆయన కోటలోని 30 పడకల ఆస్పత్రిని తనిఖీ చేశారు. పరిసరాలు శుభ్రంగా లేకపోవడం, వైద్యులు రాకపోవడం పట్ల ఆగ్ర హం వ్యక్తం చేశారు.

# మెట్టసాగుకు విత్తనాలు సిద్ధం

జిల్లాలో మెట్టసాగుకు అవసరమైన విత్తనాలను సిద్ధం చేసినట్లు వ్యవసాయ శాఖ జెడి రవికుమార్ తెలిపారు. జిల్లాకు 250 క్వింటాళ్ల కంది విత్తనాలు మంజూరయ్యాయన్నారు. కందిలో ఎల్ఆర్‌జి 30 రకం 150 క్వింటాళ్లు, ఎల్ఆర్‌జి 41 రకం 100 క్వింటాళ్లు వచ్చినట్లు చెప్పారు. 5 క్వింటాళ్ల నువ్వులను సిద్ధం చేశా మన్నారు. హైబ్రిడ్ రకాలు పెసర, మినుములు ప్రైవేట్ డీలర్ల వద్ద కొనుగోలు చేసు కోవాలన్నారు. ఖరీఫ్ సీజన్‌కు అవసరమైన ఎరువులు సిద్ధంగా వున్నాయని తెలిపారు.

**వ్యవసాయశాఖ జెడి ప్రకటన**

కొంతమేర ఎరువులు దిగుమతి చేసుకొన్నామని అవసరాన్ని బట్టి సరఫరా చేస్తామ న్నారు. జిల్లాలో ఈ ఖరీఫ్ సీజన్‌లో డిఏపి 33,478 మెట్రిక్ టన్నులు అవసరం కాగా ఇప్పటి వరకు 13,221 మెట్రిక్ టన్నులు సరఫరా జరిగిందన్నారు. ఇతర కాంప్లెక్స్ ఎరు వులు 46,666 మెట్రిక్ టన్నులు అవసరం కాగా 23,201 టన్నులు సరఫరా అయ్యిం దన్నారు. విచక్షణారహితంగా నత్రజని ఎరువుల వాడకం మంచిది కాదని వ్యవసాయా ధికారులు, శాస్త్రవేత్తల సూచనల ప్రకారమే ఎరువులను వాడాలని సూచించారు.

# బోగోలు టిడిపి అధ్యక్షునిగా పాయసం

బోగోలు మండల తెలుగుదేశం పార్టీ అధ్యక్షునిగా పాయసం రవికుమార్ ఎన్నికయ్యారు. ఆయన ఈ బాధ్యతలు చేపట్టడం ముచ్చటగా మూడవ సారి. ముసునూరులో గల పమిడి హైస్కూలులో జరిగిన కార్యవర్గ ఎంపికల్లో కందు కూరు మాజీ ఎమ్మెల్యే డాక్టర్ శివరాం, కావలి శాసన సభ్యుడు బీద మస్తాన్‌రావు తదితరులు పాల్గొన్నారు. కార్యవర్గంలో తిరిగి పాత వారినే నియమిస్తున్నామని బీద చెప్పడంతో కొందరు అసంతృప్తి వ్యక్తం చేసినా చివరకు ఆయన చెప్పిన వారినే అం దరూ ఆమోదించారు.

# స్వర్ణాంధ్ర కాదు మద్యాంధ్రప్రదేశ్!

**వెంకటగిరి ఎమ్మెల్యే ఎద్దేవా**

కాంగ్రెస్ ప్రభుత్వం రాష్ట్రాన్ని మద్యాంధ్రప్రదేశ్‌గా మార్చివేసిందని వెంకటగిరి శాసనసభ్యుడు కురుగొండ్ల రామకృష్ణ విమర్శించారు. రాపూరులో పర్యటిం చిన ఆయన ప్రభుత్వ తీరుతెన్నులపై ధ్వజమెత్తారు. రాష్ట్రంలో సంక్షేమ కార్యక్రమాలు అమలు చేస్తున్నామని ప్రభుత్వం చెప్తున్నా అది కేవలం లిక్కర్ వ్యాపారుల సంక్షేమంగా మారిం దని ఎద్దేవా చేశారు. ప్రభుత్వం లిక్కర్ ద్వారా ఖజానా నింపు కొనేందుకు ప్రయత్నిస్తూ ప్రజలను మద్యానికి బానిసలుగా మార్చి వేస్తున్నదన్నారు. త్వరలో రేషన్‌షాపుల్లో సైతం మద్యం అమ్మకాలు చేపట్టినా ఆశ్చర్యపోవాల్సిన అవసరం లేదన్నారు. ఇంతగా మద్యం అమ్మకాలను పెంచి పోషిస్తున్న ప్రభుత్వం వేశ్యాగృహాలకూ అనుమతిచ్చినట్లయితే ఆ రకంగాను ఆదా యం గడించవచ్చునని తీవ్రంగా విమర్శలు చేశారు.

ప్రజల మన్ననలు పొందిన

# బోగోలు తహశీల్దార్!

ప్రభుత్వ పథకాలను ప్రజల వద్దకు తీసుకొని పోవ డంతో, ప్రజల సమస్యలను పరిష్కరించడంలో బోగోలు తహశీల్దార్ ప్రశాంతకుమారి చేసిన కృషి పలువురి మన్ననలు అందుకొంది. మండలానికి తహశీల్దార్‌గా వచ్చిన నాటి నుంచి ఆమె పేదలకు పింఛన్లు, వృద్ధాప్య పింఛన్లు, ఇం దిరమ్మ ఇళ్లు, భూపంపిణీ, వికలాంగ పింఛన్లు అందజేసి మం డల ప్రజల అభిమానం చూరగొనింది. ఇటీవల లైలా తుఫాను సంభవించినపుడు పలు ప్రాంతాల ప్రజలను సురక్షిత ప్రాంతా లకు తరలించి, ఆహార సదుపాయాలు కల్పించడంలో విశేష కృషి చేయడం ద్వారా మండల ప్రజల అభిమానం చూరగొ న్నది. మంచి అధికారిగా పేరు గడించిన ప్రశాంతికుమారి ఈ నెలాఖరుకు పదవీవిరమణ చేయనుండడంతో మండల ప్రజలు ఆమెను కలసి తమను వీడి వెళ్తున్నందుకు బాధపడుతున్నారు. ఈ నెల 30న రిటైర్‌మెంట్ సందర్భంగా అభినందన సభ నిర్వ హిస్తున్నట్లు చెప్పారు.

## కామ్రేడ్లకు ఉపఎన్నికల తలనొప్పి



తెలంగాణ ఉప ఎన్నికలు కామ్రేడ్లకు తలనొప్పిగా మారాయి. ప్రస్తుతం ఉప ఎన్నికలు జరుగుతున్న నియోజకవర్గాల్లో కామ్రేడ్ల బలం నామమాత్రమే. ఎన్నికల్లో పోటీచేసి గెలిచే సత్తా కమ్యూనిస్టు పార్టీలకు లేదు. ప్రత్యేక తెలంగాణకు సిపిఎం ససేమిరా అంటోంది. దీంతో తెలంగాణలో ఆ పార్టీపై తీవ్ర వ్యతిరేకత వుంది. ఇక తెలంగాణను కోరుకుంటున్న సిపిఐ పరిస్థితి మరో రకంగా వుంది. సొంతంగా పోటీ చేసి గెలిచే సత్తా లేదు. అలాగని ఎవరికైనా మద్దతు ఇచ్చి బరిలో నుంచి తప్పుకుంటే సిద్ధాంతాలు అడ్డం వస్తున్నాయి. ఈ పరిస్థితుల్లో ఏం చేయాలో పాలుబోక ఆపార్టీ రాష్ట్రప్రధాన కార్యదర్శి నారాయణ తలపట్టుకుంటున్నాడు. ఏం చేస్తాం! కామ్రేడ్ల బాధ కామ్రేడ్లది అంటూ ఇతర పార్టీలు తమాషా చూస్తున్నాయి.

## వార్తల్లో వైఎస్ జయంతి



వైఎస్ పుట్టిన రోజు ఇప్పుడు రాజధానిలో హాట్ టాపిక్‌గా మారింది. వచ్చే నెల 8వ తేదీన వై.ఎస్ జయంతి. అయితే ఆరోజున ఓదార్పు యాత్రకు బయలుదేరాలని జగన్ ఇప్పటికే నిర్ణయించాడు. జగన్ యాత్రను నిర్వీర్యం చేయడానికి రోశయ్య రకరకాల అస్త్రాలను వదలుతున్నాడు. వైఎస్ జయంతిని పార్టీ ఆధ్వర్యంలో ఘనంగా జరపాలని నిర్ణయించారు. జగన్ యాత్రకు వెళ్లకుండా ఎమ్మెల్యేల్ని నిరోధించడానికి వచ్చే నెల మొదటి వారంలో అసెంబ్లీ వర్షాకాల సమావేశాల్ని ప్రకటించాడు. దీంతో వై.ఎస్ జయంతి పత్రికల్లో పతాక శీర్షికలకు ఎక్కింది. ఆరోజు ఏం జరుగుతుందో? జగన్ ఓదార్పు యాత్రకు బయలుదేరుతాడా? ఎమ్మెల్యేలు ఎవరైనా అసెంబ్లీకి డుమ్మా కొట్టి జగన్ వెంట వెళతారా? అంటూ రాజకీయ వర్గాలు ఇప్పటినుంచే చర్చల్లో మునిగిపోయాయి.



కల్లూరుపల్లిలో ప్రభుత్వ స్థలంలో ఇంటి నిర్మాణాలు చేసుకొన్నారంటూ కూలగొడుతున్న రెవిన్యూ యంత్రాంగం.

## డిఎస్ పితలాటకం



రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు డి.శ్రీనివాస్‌కు ఉపఎన్నికలు అగ్నిపరీక్షగా మారాయి. నిజామాబాద్ అర్బన్ నుంచి ఉప ఎన్నికల్లో డిఎస్ కూడ పోటీచేస్తున్నాడు. ఉపఎన్నికల్లో తాను గెలవడంతోపాటు మరో రెండు సీట్లయినా కాంగ్రెస్ నెగ్గగలిగితే డిఎస్ జాతకం మారిపోతుంది. తెలంగాణలో ఏకైక కాంగ్రెస్ నాయకుడిగా డిఎస్ పలుకుబడి ఆకాశాన్ని అంటుతుంది. అయితే కాంగ్రెస్ ఓడిపోతే మాత్రం డిఎస్ రాజకీయ జీవితానికి గండిపడుతుందని గాంధీభవన్‌లో గుసగుసలాడుకుంటున్నారు. నిజామాబాద్ అర్బన్ నుంచి బిజెపి అభ్యర్థి బరిలో వుండటం డిఎస్‌కు గుడ్డిలో మెల్లగా వుంది. తాను స్వయంగా టిఆర్ఎస్‌తో తలపడక పోవడం వల్ల జనం ఓట్లు వేస్తారని ఆయన ఆశపెట్టుకుంటున్నాడు. తాను గనుక గెలిస్తే ముఖ్యమంత్రి పదవి కూడా వస్తుందంటూ కార్యకర్తల సమావేశాల్లో చెబుతున్నాడట. మొత్తానికి డిఎస్ కొండకే గాలం వేస్తున్నాడు కదూ... చూద్దాం! ఏం జరుగుతుందో!!

## దివాకర్ వైరాగ్యం



మాజీమంత్రి దివాకర్‌రెడ్డి వైరాగ్యంలో వున్నాడు. మంత్రి పదవి మీద దివాకర్ పెట్టుకున్న ఆశ యిప్పట్లో తీరేట్లు లేదు. దీంతో దివాకర్ డీలా పడిపోయాడు. గతంలో చీటికీ మాటికీ రోశయ్యను వెనుకేసుకొచ్చిన దివాకర్ కొంతకాలంగా మౌనంగా వుంటున్నాడు. పత్రికా విలేకర్లు కనిపిస్తే చాలు ముఖం చాటేస్తున్నాడు. ఆఫ్ ది రికార్డు అంటూ రోశయ్యపై జోకులు కూడా వేస్తున్నాడట. మంత్రివర్గంలో మార్పులు చేసే శక్తి రోశయ్యకు లేదంటూ పెదవి విరుస్తున్నాడు. అయితే మంత్రి పదవి మీద ఆశపెట్టుకున్న పి.శంకరరావు మాత్రం ఇప్పటికీ రోశయ్యను భుజాన మోస్తునే వున్నాడు. శంకర్రావును వ్రతం చెడ్డా ఫలితమైనా దక్కుతుందో లేదో అంటూ దివాకర్ జోకులేస్తున్నాడు.

## తెలంగాణానికి 'చిరు' దూరం



సమైక్యాంధ్ర రాగాన్ని ఆలపిస్తున్న చిరంజీవి తెలంగాణకు దూరమవుతున్నాడు. త్వరలో జరగనున్న ఉప ఎన్నికల్లో పోటీచేయడానికి కూడా 'చిరు' విముఖంగా వున్నాడు. తెలంగాణ వ్యతిరేకవాదిగా చిరంజీవి ఇప్పటికే ముద్రపడ్డాడు. ఈ కారణంగానే తెలంగాణ జిల్లాల పర్యటన అంటే చాలు 'నో' అంటూ ఎర్రజెండా ఊపేస్తున్నాడు. ఎలాగూ ఉప ఎన్నికల్లో గెలిచేది లేదు కాబట్టి బరిలో దిగకపోవడమే మంచిదని భావిస్తున్నాడు. ఇటీవలే కాంగ్రెస్‌తో దోస్తీ కుదరటం కూడా 'చిరు'కు కలిసొచ్చింది. కాంగ్రెస్‌కు మద్దతు ప్రకటిస్తూ ఉప ఎన్నికలకు దూరంగా వుంటున్నాడు. దీని వల్ల కాంగ్రెస్ అధిష్టానం వద్ద చిరుకు మార్కులు పడటంతోపాటు, తెలంగాణలో తిరిగి ప్రజల నుంచి వ్యతిరేకతను ఎదుర్కొనే ప్రమాదం తప్పింది సో... 'చిరు' లక్కీనే!



## భలేరావు బదిలీ వెనుక...!




స్పెషల్ చీఫ్ సెక్రటరీ హోదాలో ప్రధాన పరిపాలనా శాఖలో వున్న భలేరావును ప్రభుత్వం ఆగమేఘాల మీద బదిలీ చేసింది. రాష్ట్ర సమాచార కమిషనర్ల నియామకాలను ఈ శాఖ ద్వారానే జరుపుతారు. ఈ నెలాఖరుకు రిటైర్ కానున్న జన్నత్ హుస్సేన్‌ను ప్రధాన సమాచార కమిషనర్‌గా నియమించడానికి రంగం సిద్ధమైంది. అయితే ప్రధాన పరిపాలనశాఖలో భలేరావు ఇందుకు అడ్డుగా మారారు. కమిషనర్ నియామకానికి అభ్యర్థుల జాబితా తయారుచేసి అందులో మెరిట్ గల వ్యక్తిని ప్రధాన సమాచార కమిషనర్‌గా నియమించాలని భలేరావు ప్రతిపాదిస్తున్నాడట. దీంతో అడ్డు తొలగించి జన్నత్ రూట్‌ను క్లియర్ చేసేందుకు భలేరావును బదిలీ చేసి పశుసంవర్ధకశాఖను అప్పగించారు. అయితే ప్రధాన సమాచార కమిషనర్‌గా ఇప్పటికే ఉత్తరాదికి చెందిన సిడి అర్హా ఉండగా తిరిగి అదే ప్రాంతానికి చెందిన జన్నత్‌ను నియమిస్తుండటం పట్ల పలువురు పెదవి విరుస్తున్నారు.



# సరసస్వతిదేవిని పూజిస్తే చక్కని విద్యాబుద్ధులు!

విద్యకు అధిదేవత సరస్వతి. సకల కళలు, విద్య, సంగీతజ్ఞానం సరస్వతి దేవి కృపాకటాక్ష వీక్షణాల వల్ల కల్గుతుందని పురాణాలు చెప్తున్నాయి. శ్వేతాంబరి అయిన ఆమె అపార వేదరాశికి మాతృమూర్తి. బ్రహ్మదేవుని అర్ధాంగి అయిన సరస్వతి మాత విశ్వసృష్టికి మూలమైన పరమజ్ఞానాన్ని ప్రసాదించిందిగా పురాణకథనం. లక్ష్మీదేవికి సహోదరిగా గణేశ కార్తికేయులు సోదరులుగా గల సరస్వతి దేవి స్వరాలు (శబ్దాలు), వర్ణాలు (రాగాల)కు అధిదేవత. విద్యాబుద్ధులు, సకల విజ్ఞానాన్ని ప్రసాదించే దేవిని పూజించినట్లయితే చక్కని విద్య, తెలివితేటలు, మేథస్సు లభిస్తుందని మహర్షుల ఉవాచ.

తెల్లని పట్టుచీర ధరించి కమలంపై ఆశీనురాలై నాలుగు చేతులు కల్గి ఒక దానిలో పద్మం, మరో చేతిలో తాళ పత్రగ్రంధం పట్టుకొని, మరో చేతితో వీణను, నాలుగో హస్తంతో వీణ తంత్రులను కదిలిస్తున్నట్లు వుండి కిరీట ధారియై హృద్యంగా కన్పించే చదువుల తల్లికి పసుపు వర్ణం పూలు అంటే ఎంతో ప్రీతి. వాక్ స్వరూపిణి వసంతపంచమి నాడు మూల నక్షత్రంలో జన్మించినందువల్ల ఆనాడు ప్రత్యేక పూజలు చేస్తారు. విద్యార్థులు సరస్వతిమాత చరణాలను ఆశ్రయించినట్లయితే సకల విద్యాబుద్ధులు కల్గి, విజ్ఞానవంతులు అవుతారు. కాబట్టి పిల్లలను బడిలో చేర్పించేనాడు వారి చేత అక్షరాభ్యాసం చేయిస్తారు. ఓం నమ:శివాయ అనే మంత్రాక్షరాలను దిద్దించే ఆచారం వుంది. బీజమంత్రమైన ఓం సరస్వత్యైనమ: అని జపిస్తూ సరస్వతి దేవిని పూజించినట్లయితే విద్యార్థులకు సకల శుభాలు కల్గుతాయి. నగరంలోని మూలాపేట శివాలయంలోగల జ్ఞానసరస్వతి మందిరంలో ప్రతి గురువారం సరస్వతి మాతకు ప్రత్యేక పూజలు, పల్లకిసేవ జరుపడం ఆనవాయితి.

*సరస్వతి నమస్తుభ్యం వరదేకామరూపిణి*
*విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భ వతు మే సదా:*

అంటూ పూజించినట్లయితే విద్య, కళ, సంగీత జ్ఞానం సంపూర్తిగా అందుతాయని నమ్మకం.

ట్రంకు రోడ్డు 

## మేయర్ గాజులబేరం!



నెల్లూరు మేయర్ భానుశ్రీ బేబిక్రాప్‌తో వుండడం వల్ల వందమందిలోనూ గుర్తు పట్టవచ్చు. దానికి తోడు ఆమె కట్టుబొట్టు కూడా విలక్షణంగా వుంటుంది. అటువంటి మేయర్ గారు రంగురంగు గాజులు, రవ్వలగాజులు కొనను ఈ వారం హైదరాబాద్ చార్మినార్ ప్రక్కనే వుండే లాడ్ బజారును సందర్శించారు. తనకిష్టమైన మనసుకు నచ్చిన గాజులను రేట్లు గోజారి మరి కొన్నారు. ఇటువంటి కొనుగోళ్లలో ఆమె వెంటవుండే నెల్లూరు రూరల్ శాసన సభ్యుడు వివేకానందరెడ్డి లేకపోవడమే కొసమెరుపుగా చెప్పుకోవచ్చు.

## సోమిరెడ్డిలో సమరోత్సాహం



ఏదో ఒక సమస్య వుంటే నిత్యం వార్తల్లో వుండొచ్చునని జిల్లా తెలుగుదేశంపార్టీ అధినేత సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి తలపోస్తుంటారు. అటువంటి ఆయనకు విపరీతంగా పాట తెగిన మద్యం షాపులు కానవచ్చాయి. ఎక్కువరేటుకు పాట పాడామని మద్యాన్ని ఎమ్మార్పీ రేట్ల కన్నా ఎక్కువ రేటుకు మద్యం షాపులవారు అమ్మితే వుద్యమిస్తామని ప్రకటించారు. దీనికోసం 1తేది నుంచి పార్టీ కార్యకర్తలు, ప్రజలను చైతన్యం చేస్తామన్నారు. సోమిరెడ్డి ఈ మాట చెప్పారో లేదో మద్యం వ్యాపారులు ఆలోచనలోపడ్డారు. లిక్కర్ అసోసియేషన్ నాయకులు ఒక సమావేశం పెట్టుకొని పాత ధరలకే మద్యం విక్రయిస్తామని ప్రకటించారు. మొత్తానికి వుద్యమించకుండానే మద్యాన్ని పాత ధరలకే అమ్మేలా చేస్తున్న సోమిరెడ్డికి మందుబాబులు రుణపడి వుండాలంటారా... లేదా?

## పనిచేయరేమిటి?




తానిస్తున్న ఆదేశాలను డిఎస్పీలు, సిఐలు, ఎస్ఐలు అమలు పరచకపోవడంతో ఎస్పీ దామోదర్ ఈవారం వారితో నిర్వహించిన సమీక్షా సమావేశంలో అగ్గిమీద గుగ్గిలమయ్యారు. పెండింగ్ కేసులు పెరిగిపోతున్నాయి. చోరీలు, దోపిడీలపై అప్రమత్తత లేదు. జైలు నుంచి విడుదలైన దొంగల పట్ల దృష్టి పెట్టకపోవడంతో వాళ్లు శ్రీహరికోటలోని షార్ కాలనీలో వరుస దొంగతనాలు చేశారని కస్సుబుస్సులాడారు. నెల్లూరు నగరంలో ట్రాఫిక్ నడత మార్చను తానిచ్చిన ఆదేశాలను అమలు చేయకపోతే ఎలానని ప్రశ్నించారు. ఇకనుంచైనా బాధ్యతాయుతంగా పనిచేయకపోతే ఊరుకోనని ఎస్పీ సిబ్బందిపై మండిపడడం చర్చనీయాంశమయ్యింది. అయినా మనలోమాట ఎస్పీ చెప్పినట్లుగా క్రిందిస్థాయి సిబ్బంది ఎందుకు పని చేయడం లేదబ్బా?

## ప్రజలవి ప్రాణాలు కావా?



ప్రజలను మొన్నటివరకు వణికించిన స్వైన్‌ఫ్లూ మహమ్మారి మళ్లీ రాష్ట్రంలో నిశ్శబ్దంగా వృద్ధి చెందుతోంది. వ్యాధి నిరోధక వ్యాక్సిన్ ఎట్టకేలకు ప్రభుత్వ ఆధీనానికి వచ్చింది. నెల్లూరు పెద్దాస్పత్రి, జూబ్లీ ఆస్పత్రులకు చేరిన ఈ వ్యాక్సిన్‌ను డాక్టర్లు, పారా మెడికల్ సిబ్బంది, వారి పిల్లలు మాత్రం వేయించుకొని సరిపెట్టుకొన్న విషయం బయటపడింది. ప్రజలు ఏమైనా ఫర్వాలేదు తాము మాత్రం బాగుండాలని నెల్లూరు ప్రభుత్వ వైద్యులు తలచడం వైద్య వృత్తికే కళంకం కాదంటారా?




ప్రయాణాలలో జాగ్రత్త అవసరం. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. శుభకార్యాలకై వెచ్చిస్తారు. నూతన వస్త్రాభరణాలు కొంటారు. గృహనిర్మాణకార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులు సాయ మందిస్తారు. కుటుంబంలో సమస్యలు తీరుతాయి. రాజకీయులకు మేలైన కాలం. కళాకారుల ప్రతిష్ఠ పెరుగుతుంది. విద్యార్థులకు యోగ కాలం. పిల్లల అభివృద్ధి ఆనందాన్నిస్తుంది. ఇష్టమృష్టాన్న ప్రాప్తి.




ప్రయాణాలు ఎదురుచూసిన ఫలితాలనివ్వక పోవచ్చు. ధన విషయంలో కూడ కటకట ఉండవచ్చు. సోదరులతో అభిప్రాయ భేదావకాశాలు. వాదోపవాదాలు తగవు. పనులు నిదానంగా సాగవచ్చు. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది. ఇతరుల వ్యవహారాల్లో జోక్యం వద్దు. వ్యాపారులకు గడచిన వారంలో కన్నా మేలు. అప్పులు తీరుస్తారు. ఉద్యోగులకు గొడవలతో సాగుతుంది.




సమాజంలో కీర్తిప్రతిష్టలకు భంగం ఉండదు. పాదాలకు సంబంధించిన బాధలుంటాయి. ఆర్థికవిషయాలు చక్కగా ఉన్నాయి. నూతన వస్త్రాభరణాలు కొంటారు. వాగ్వాదాలలో సామర్థ్య ప్రదర్శన ఉంటుంది. తండ్రి తండ్రివంటివారికి ఇబ్బందులుండవచ్చు. గృహాలంకరణ విషయాలలో ఆసక్తి చూపుతారు. విద్యార్థులకు ప్రయోజనవంతమైన కాలం. అన్ని రంగాలలో ముందంజ వేస్తారు.




వృథా ఖర్చులు తయారుగా ఉంటాయి. ప్రతి అడుగు ఆచి తూచి వేయడం మంచిది. అధిక శ్రమ, అల్ప లాభం. ఆర్థిక విషయాలు కొంత తృప్తికరంగా ఉంటాయి. కళత్ర సౌఖ్యలోపం ఉండదు. వ్యాపారులు భాగస్వాములతో సఖ్యంగా ఉండడానికి ప్రయత్నించండి. రాజకీయులు తోటివారి విషయంలో జాగ్రత్తగా ఉండాలి. పైవారిని విమర్శించకుండాలి. వస్త్రాభరణాలు కొంటారు.




ఫలితాలు మీ శ్రమ, సామర్థ్యంపై ఆధారపడి ఉంటాయి. అధిక ఖర్చులు. దూరప్రయాణావకాశాలు. పట్టుదలపై పనులు సాగుతాయి. దైవకార్యాలలో ఎక్కువగా పాలు పంచుకోవాలి. వ్యాపారులకు లాభాలలో కోత ఏర్పడవచ్చు. నిదానంగా ఖాతాదారుల మనసెరిగి నడచుకోవడం మంచిది. పాతబాకీలు వసూలవుతాయి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. ఉద్యోగులకు శ్రమాధికం.




నోరు పారవేసుకోకుండడం మంచిది. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. ఉద్యోగ ప్రయత్నాలు సత్ఫలితాలనిస్తాయి. వివాహాది శుభకార్యాలలో పాలు పంచుకొంటారు. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. వ్యాపారులకు మేలైన కాలం. క్రయ విక్రయాలు మంచి ఫలితాల నందిస్తాయి. దైనందిన కార్యక్రమాలలో ఆటంకాలుండవచ్చు. విద్యార్థులకు ఒకమోస్తరుగా చదువు సాగుతుంది.

# వారఫలాలు

*తేది 26-06-2010 నుండి 2-07-2010 వరకు మిథునంలో రవి, బుధ, కేతువులు; కర్కాటంలో శుక్రుడు; సింహంలో కుజుడు; మీనంలో గురువు; కన్యలో శని; ధనుస్సులో రాహువు; కన్య, తుల, వృశ్చికాల్లో చంద్రుడు సంచరిస్తారు.*

## పంచాంగం

### శుభ ముహూర్తాలు

30,1 తేదీలలో వివాహాదులకు రా.1.00 నుండి 3.00 గంటల వరకు మేషలగ్నాన.

27, 30 తేదీలలో వివాహాదులకు తె.3.00 నుంచి 4.00 గంటల వరకు వృషభ లగ్నాన.

30తేది అన్నప్రాశనాదులకు ఉ.7.00 నుండి 8.00 గంటల వరకు కర్కాటక లగ్నాన శుభ ముహూర్తాలున్నాయి.

### జూన్ తిథులు

**జ్యేష్ఠ శుద్ధ**

| | | | | |
|---|---|---|---|---|
| 26 | శని | పౌర్ణమి | సా.4.48 | గం.ల.వ |

**జ్యేష్ఠ బహుళ**

| | | | | |
|---|---|---|---|---|
| 27 | ఆది | పాడ్యమి | సా.6.03 | గం.ల.వ |
| 28 | సోమ | విదియ | రా.7.44 | గం.ల.వ |
| 29 | మంగళ | తదియ | రా.9.51 | గం.ల.వ |
| 30 | బుధ | చవితి | రా.12.07 | గం.ల.వ |

### జూలై తిథులు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | గురు | పంచమి | రా.2.33 | గం.ల.వ |
| 2 | శుక్ర | షష్ఠి | తె.4.55 | గం.ల.వ |

**పి.ఎం.గోపాలాచారి**
16/1020, పొగతోట, నెల్లూరు - 1.
E-mail:maripmgg@yahoo.com




ప్రయాణాలమూలంగా ధనాదాయం ఎదురుచూడవచ్చు. చిన్న చిన్న సమస్యలు తొలగుతాయి. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఉచిత సలహాలు స్వీకరించవద్దు. దూరప్రయాణావకాశాలు కానవస్తున్నాయి. శ్రమ, అలసట చోటు చేసుకొంటుంది. గృహనిర్మాణ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. మిత్రులు సాయ మందిస్తారు. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు.




సంతానమూలంగా సుఖశాంతులు. ఇతరులకు కోరినా సలహాలివ్వవద్దు. ఆర్థిక విషయాలు మందకొడిగా సాగుతాయి. వ్యాపారులు ఖాతాదారులతో జాగ్రత్తగా మెలగాలి. రాజకీయులకు తీరని వేదన చోటుచేసుకొంటుంది. వ్యాపారులకు ఎదురుచూసిన సత్ఫలితాలు దక్కవు. చాలా ఓర్పు అవసరం. ఎవరికి ఎలాంటి మాట ఇవ్వవద్దు. ఉద్యోగులు భవిష్యత్తుకు మంచి పథకాలు వేస్తారు.




పౌర సంబంధాలు చక్కగా వుంటాయి. జీవితభాగస్వామి బంధువులతో గొడవలుండవచ్చు. నోరు పారవేసుకోకుండడం మంచిది. ప్రతి పని నిలిచి నిదానంగా చేయడం మంచిది. వృత్తిలో మార్పు చేర్పులుండవచ్చు. గడచిన వారం కన్నా ఉద్యోగులకు కొంత మేలు. వ్యాపారులకు లాభసాటిగా జరుగకపోవచ్చు. భాగస్వాములతో జాగ్రత్త. విద్యార్థులకు ఒకమోస్తరుగా చదువు సాగుతుంది.




సమాజ కార్యక్రమాలలో చక్కగా పాల్గొంటారు. శరీరారోగ్యం చక్కగా ఉండదు. దూరప్రయాణాలు తృప్తినిస్తాయి. సోదరులతో అభిప్రాయభేదావకాశాలు. పనులు నిదానంగా సాగవచ్చు. ఒకటికి రెండుసార్లు ఆలోచించి చేయడం మంచిది. వ్యాపారులు చాలా మెలకువగా నడచుకోవాలి. విద్యార్థులకు ఒకవిధంగా చదువు సాగుతుంది. ప్రణాళికాబద్ధంగా పనులు చేసి పేరు తెచ్చుకొంటారు.




కొంత ప్రయత్నం తర్వాతనే వివాహాది పనులు సాగుతాయి. దైవకార్యాలలో ఎక్కువగా పాలు పంచుకోవాలి. వ్యాపారులకు లాభాలలో కొంత వృద్ధి ఏర్పడవచ్చు. అయినా అధిక ఖర్చులు మనసును కుంగతీస్తాయి. నిదానంగా ఖాతాదారుల మనసెరిగి నడచుకోవడం మంచిది. భాగస్వాములతో గొడవలు రాకుండా చూసుకోవాలి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు.




శరీరారోగ్యం ఇబ్బంది పెడుతుంది. దైవ కార్యాలలో ఎక్కువగా పాలు పంచుకోవాలి. మిత్రుల తోడ్పాటు లభిస్తుంది. విద్యా కళా రంగాలలో ప్రసిద్ధి పొందుతారు. వ్యాపారులకు లాభాలలో కొంత కోత ఏర్పడవచ్చు. భాగస్వాములతో గొడవలు రాకుండా చూసుకోవాలి. నిలచి నిదానంగా అడుగేయాలి. రాజకీయులు లేనిపోని గొడవల్లో చిక్కుకొంటారు. ఉద్యోగులకు శ్రమ అధికం.

# ‘చలిత దోషం’ పిల్లలపై అనర్ధ ప్రభావం!

*పరిడం అనంతలక్ష్మి — గూడూరు*

** ముందు స్థలం ఎక్కువ, వెనుక స్థలం తక్కువగా వుంది. గృహనిర్మాణం చేశాము.*

ఈ విధమైన స్థలాన్ని ఒకే ప్రాంతంలో రెండు ప్లాట్లు వేరు వేరు కొలతలతో వుంటే అవి చలిత దోషాన్ని కలిగిస్తాయి. పిల్లలు అనారోగ్య వంతులు, భ్రష్టులూ అవుతారు.

*డాక్టర్ లలితానంద్ — చెన్నై*

** ఏయే స్థలాలకు ఏ ఏ రాశులు ఆధిపత్య రాశులవుతాయో చెబుతారా?*

తూర్పు వృశ్చికం, పడమర ధనస్సు, ఉత్తరం వృషభం, దక్షిణం మేషం, ఈశాన్యం కుంభం, వాయువ్యం తుల, ఆగ్నేయం మీనం, నైరుతి శని ఆధిపత్యరాశులు.

*డాక్టర్ పి.శేషగిరిరావు — హైదరాబాద్*

** లేఅవుట్ సక్రమంగా లేదు. మా స్థలం నలుచదరంగా వుంది?*

స్థలానికి లేఅవుట్ ప్లాను కోణవేధలున్నాయి. మీరా ప్లాటు కొనకండి. సమస్యల్ని కొని తెచ్చుకొన్నట్లవుతుంది.

*ఎమ్.ఉషారాణి — ఒంగోలు*

** నైరుతి బ్లాకు స్థలం కొన్నాను. దానినెలా సంస్కరించాలి?*

నైరుతి బ్లాకుకు రాహు, కేతులు ఆధిపత్య రాశులు, అందరి ఇళ్లు పశ్చిమం వైపున్నాయి. గనుక మీరు పశ్చిమం వైపు నిర్మించుకోండి. ఈ బ్లాకుకు గురు, చంద్ర, రవి వ్యతిరేక ప్రభావాలుంటాయి కాబట్టి లక్ష్మీకృత వాస్తు యంత్ర ప్రతిష్ట చేయండి.

*పి.వి.కృష్ణవంశీ — కర్నూలు*

** ‘సమరాంగణ సూత్రధారణ’ వాస్తుశాస్త్ర గ్రంథం ఎవరు, ఎప్పుడు రాశారు?*

క్రీ.శ 11వ శతాబ్దిలో భోజరాజు ఈ గ్రంథాన్ని వ్రాశారు.

*గోరంట్ల వసుమతి — అనంతపురం*

** దక్షిణ ప్లాటు అమ్మాయికి భరణంగా యిచ్చాము. ఇప్పుడదివద్దని డబ్బు ఇవ్వమని అడుగుతున్నారు.*

వాళ్లెలాంటి వాళ్లో అర్థమయింది గనుక మీకు ఉత్తరం ప్లాటు ఉంది గనుక అది ఇవ్వండి. అయితే అది మామగారిపై ప్రభావం చూపిస్తుంది.

*డాక్టర్ నందివర్ధనరావు — సికింద్రాబాద్*

** ‘మత్స్య పురాణం’ వాస్తుశాస్త్రవేత్తల ప్రసక్తి వుంది. తమరికి తెలుసా?*

‘మత్స్య పురాణం’ మూడవ అధ్యాయంలో 18 మంది మహర్షుల గురించిన వివరాలున్నాయి. భృగువు, అత్రి, వశిష్ఠులు వరుస క్రమంలో రాగా చివరలో వాసుదేవ, అనురుద్ధ, శుక్ర, బృహస్పతి చివరి స్థానంలో వస్తారు.

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ఎస్.నారాయణాచార్యులు — నెల్లూరు*

** తూర్పు స్థలం ఆగ్నేయంలో సెప్టిక్‌ట్యాంకు వున్నది. పిల్లలు, ఆవిడ అనారోగ్యంతో వున్నారు.*

తూర్పు ఈశాన్య, ఆగ్నేయం పురుషస్థానాలు. ఆగ్నేయం శుక్రస్థానం పురుషస్థానానికి వ్యతిరేకులైన స్త్రీలు, పిల్లలు అనారోగ్యవంతులవుతారు.

*ఎమ్.రామారావు — రాయచూరు*

** వాయువ్యం సెప్టిక్‌ట్యాంకు పూడ్చేసి యంత్ర ప్రతిష్ట చేశాక ఆమె ఆశ్చర్యంగా కోలుకుంది.*

పశ్చిమ, ఉత్తర స్థల దోషాలు ఎక్కువ దోషాలున్న దిక్ప్రభావాల్ని కలిగిస్తాయి. అందువల్లే ఆమె ‘కోమా’స్థితికి వెళ్లిపోయింది. అగాధం పూడ్చేసి ‘సుదర్శన యంత్రం’ ప్రతిష్ట చేశాక యంత్ర బీజాక్షర ప్రభావం వల్ల కోలుకోగలిగింది.

*జి.వి.రాములు — గూడూరు*

** పశ్చిమ స్థలం తూర్పు ఇల్లు ఆర్థికంగా కలసి రావడం లేదు.*

పశ్చిమం వైపే ఇల్లు నిర్మించారు. తూర్పు నిర్మాణం వల్ల ఇంద్రస్థానం ఆధిపత్యరాశి అవుతుంది. శని పశ్చిమాధిపతి కనుక అతణ్ని ఎదుర్కొనవలసి వస్తుంది. అంచేత ‘సుదర్శన చక్ర’ ప్రతిష్ట వల్ల సమస్య పరిష్కరింపబడుతుంది.

*ఎం.ప్రవీణారెడ్డి — నెల్లూరు*

** అపార్టుమెంటు దగ్గర స్థలం కొనవచ్చా?*

‘మర్రి వృక్షం’ క్రింద మొక్కలు మొలవ్వు. నీటి కొరత, వాయుకాలుష్యం ఎక్కువ. కొనకపోవడమే మంచిది.

# సూళ్లూరుపేటను సతమతం చేస్తున్న సమస్యలు!

అసెంబ్లీ నియోజకవర్గ కేంద్రంగా వున్న సూళ్లూరుపేట పంచాయితీ అన్నింటిలో వెనుకబడిపోయింది. జాతీయ రహదారి ప్రక్కనే వున్నప్పటికి ఏ మాత్రం అభివృద్ధి జరగడం లేదు. త్రాగు నీటి సరఫరా, పారిశుద్ధ్యం, అంతర్గత రోడ్లు లేక పంచాయితీ ప్రజలు అనేక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. కొద్దిపాటి వర్షం వచ్చినా కూడా రోడ్లపై నీరు నిల్వ వుంటుంది. గ్రామపంచాయితీ పాలకవర్గం దృష్టికి అనేక మార్లు ఈ సమస్యలను ప్రజలు తీసుకెళ్లినా కూడా పట్టించుకుంటున్న దాఖలాలు లేవు.

సూళ్లూరుపేట గ్రామపంచాయితీ సర్పంచ్‌గా తెలుగుదేశం పార్టీకి చెందిన తన్నీరు శేషగిరిరావు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. ఈ పంచాయితీలో 7వేల కుటుంబాలు 40వేల మంది జనాభా, 25వేల మంది ఓటర్లు వున్నారు. దీని పరిధిలో కోళ్లమిట్ట, మన్నారుపోలూరు, బాబుజీ కాలనీ, నరసారెడ్డిపాళెం, చిన్నసత్రం తదితర కాలనీలున్నాయి. ప్రతి సంవత్సరం పన్నుల రూపంలో గ్రామపంచాయితీ దాదాపు 25లక్షల రూపాయలు వసూలు చేస్తుంది. ఇవి కాకుండా ప్రభుత్వం నుంచి గ్రాంట్లు రూపంలో ఎస్.ఎఫ్.సి, 12వ ఆర్థిక సంఘం నిధులు కలిపి మరో 15 లక్షలు విడుదలవుతుంటాయి.

ఈ నిధులన్నింటిని కలిపి గ్రామపంచాయితీ పరిధిలో పలు అభివృద్ధి పనులు చేపట్టవచ్చు. గ్రామ పంచాయితీ పరిధిలో ప్రజల నుంచి పన్నులు సక్రమంగా వసూలు చేసేవారు లేకపోవడం కారణంగా బకాయిలు భారీగానే పేరుకుపోయి వున్నాయి. మొత్తం 20 వార్డులలో దాదాపు 10 లక్షలకుపైగా బకాయిలు వున్నాయంటే పాలకవర్గం పన్నులను ఏ విధంగా వసూలు చేయిస్తుందో అర్థం చేసుకోవచ్చు. ఇక్కడ ఎమ్మెల్యే తెలుగుదేశం పార్టీకి చెందిన వారు కావడం, అలాగే గ్రామ పంచాయితీ సర్పంచ్ కూడా ఇదే పార్టీకి చెందిన వారు కావడం వలన ప్రభుత్వం వైపు నుంచి సహకారం అందడం లేదన్న ఆరోపణలు వున్నాయి.

గ్రామ పంచాయితీ అభివృద్ధి కోసం ప్రభుత్వం నుంచి నిధులు మంజూరు కోసం అన్నివిధాలుగా పాలకవర్గం ప్రయత్నాలు చేస్తుంది. సూళ్లూరుపేట పట్టణంలో పలు రోడ్లు చాలా అధ్వాన్నంగా కనిపిస్తున్నాయి. డ్రైనేజి కాల్వలు, వీధులలో వేసిన చెత్త, చెదారాన్ని ప్రతిరోజు శుభ్రం చేయకపోవడంతో పేరుకుపోయి వుంటుంది. పారిశుద్ధ్యం సిబ్బంది కొరత కూడా వుంది. అన్ని వార్డులకు అవసరమైన సిబ్బంది లేకపోవడంతో ప్రతి రోజు వీధులను శుభ్రం చేయలేకపోతున్నారని వార్డు సభ్యులు అంటున్నారు.

ప్రభుత్వం గ్రామ పంచాయితీలకు అవసరమైన సిబ్బందిని నియమించకపోవడం వలన కాంట్రాక్టు ప్రాతిపదికన ఒకరు, ఇద్దరిని నియమించుకుంటున్నారు. పంచాయితీ పాలకవర్గం ఎన్నికై దాదాపు నాలుగున్నర సంవత్సరాలు పూర్తి కావస్తుంది. మరో ఆరు నెలల్లో స్థానిక సంస్థల ఎన్నికలు జరగనున్నాయి. ఈ నేపథ్యంలో ప్రజల అవసరాలను తీర్చేందుకు అన్ని రాజకీయ పార్టీలు సన్నద్ధమవుతున్నాయి.



**సహకారం లేదు!**

గ్రామ పంచాయితీలకు ప్రభుత్వం వైపు నుంచి అవసరమైన సహాయ సహకారం అందడం లేదు. గ్రామ పంచాయితీకి వసూలయ్యే పన్నుల నుంచే అన్ని సదుపాయాలు కల్పించుకోవాల్సి వుంటున్నది. పన్నులు సక్రమంగా వసూలు కాకపోవడం, సమస్యలు అధికంగా వుండడం వల్ల నిధుల కొరత ఏర్పడుతున్నది. స్థానికసంస్థల పట్ల ప్రభుత్వం చాలా నిర్లక్ష్యంగా వుంటోంది.

– **తన్నీరు శేషగిరిరావు**, సర్పంచ్




సూళ్లూరుపేట గ్రామ పంచాయితీ కార్యాలయం.



చెత్తా చెదారం పేరుకపోయిన మురుగుకాల్వ.

అవినీతి కథ

● స్వాహాకు

# మరుగుదొడ్ల నిధులు అతీతం కాదు!

**జిల్లాలో సంపూర్ణ పారిశుధ్య పథకం క్రింద మరుగుదొడ్ల నిర్మాణానికి 35కోట్ల 82లక్షల రూపాయలను ప్రభుత్వం విడుదల చేసింది. కానీ ఈ మొత్తంలో ఎక్కువ శాతం నిధులు స్వాహా అయ్యాయే తప్ప మరుగుదొడ్ల నిర్మాణం జరగలేదు.**

జిల్లాలో పేద, బడుగు, బలహీన వర్గాల వారికి సంపూర్ణ పారిశుద్ధ్యం పథకం క్రింద చేపట్టిన మరుగుదొడ్ల నిర్మాణంలో అనేక అవినీతి అక్రమాలు చోటు చేసుకున్నాయి. నీటి సరఫరా విభాగం ఆధ్వర్యంలో ఈ పథకం అమలుకు ప్రభుత్వం శ్రీకారం చుట్టింది. గృహాలతోపాటు, పాఠశాలలో, అంగన్‌వాడి కేంద్రాలలో కూడా ఈ విభాగం ఆధ్వర్యంలో నిర్మాణాలు చేపట్టడం జరిగింది. ముఖ్యంగా గ్రామీణప్రాంతాలలో మరుగుదొడ్ల నిర్మాణ పథకం నిర్వీర్యమైపోయింది. ఒక్క దానికి 3వేల 500 రూపాయలు నిధులు మంజూరు చేయాల్సి వుంటుంది.

రికార్డులలో మాత్రం మొత్తం పని పూర్తయినట్లుంది. గ్రామీణ ప్రాంతాలలో చూస్తే ఇందుకు విరుద్ధంగా కనిపిస్తుంది. కొంతమంది లబ్దిదారులు సొంతంగా మరుగుదొడ్లు నిర్మించుకొని వున్నారు. వీటికి నేటికి బిల్లులు మంజూరు కాని పరిస్థితి వుంది. బిల్లులు మంజూరు కోసం గ్రామీణ నీటి సరఫరా విభాగం అధికారుల చుట్టూ తిరుగుతున్నా మంజూరు కావడం లేదు. అధికారుల లెక్కల ప్రకారం సంపూర్ణ పారిశుద్ధ్యం పథకం క్రింద 2,26,725 మరుగుదొడ్ల నిర్మాణానికి రూ.35కోట్ల 82 లక్షలు కేటాయించారు. ఇప్పటి వరకు లక్షా 10వేల,695 వ్యక్తిగత మరుగుదొడ్లు పూర్తి చేశారు.

అంగన్‌వాడి కేంద్రాలకు 197 మరుగుదొడ్లకు రూ.10,30 లక్షలు ఖర్చు చేసినట్లు చెబుతున్నారు. 1461 పాఠశాలల్లో మరుగుదొడ్ల నిర్మాణానికి రూ.315.40 లక్షలు ఖర్చు చేశారు. అధికారులు నిర్మించిన మరుగుదొడ్లు నాసిరకంగా వుండడంతో వీటిని ప్రజలు వినియోగించడం లేదు. ఫలితంగా ఎందుకూ పనికిరాకుండా నిరుపయోగంగా వున్నాయి. మండల స్థాయిలో విధులు నిర్వహించే గ్రామీణ నీటి సరఫరా విభాగం ఇంజినీర్లు, వర్కుఇన్‌స్పెక్టర్లు వీటి నిర్మాణంలో చేతివాటం ప్రదర్శించారన్న ఆరోపణలు వెల్లు వెత్తుతున్నాయి.

వీటిపై వచ్చిన ఆరోపణలు గురించి జిల్లాస్థాయి అధికారులకు తెలిసినా కూడా అవినీతి అక్రమాలకు పాల్పడిన వారిపై ఎటువంటి చర్యలు తీసుకోలేదు. ఈ పథకం జిల్లాలో ప్రారంభమై దాదాపు 7 సంవత్సరాలు కావస్తుంది. మొదటిగా మరుగుదొడ్ల నిర్మాణం కోసం ప్రజలు ఆసక్తి కనబరచగా, నిర్మాణం సక్రమంగా లేకపోవడం, బిల్లులు సకాలంలో మంజూరు కాకపోవడం వంటి కారణాలతో వెనుకడుగు వేశారు. మరుగుదొడ్లు నిర్మించుకున్న వారికి బిల్లులు చెల్లించకుండానే చెల్లించినట్లు రికార్డులలో చూపుతున్నారు.

సంవత్సరాలు గడిచిపోతున్నా వీటి గురించి పట్టించుకునే వారు లేకుండా పోయారు. మండల కేంద్రాలలో పనిచేసే ఇంజినీర్లు, వర్కు ఇన్‌స్పెక్టర్లు ఇతర ప్రాంతాలకు బదలీ కావడం వలన కొత్తగా వచ్చినవారు తమకు తెలియదంటూ లబ్దిదారులకు సమాధానం చెప్పి చేతులెత్తేస్తున్నారు. దీంతో బాధితులు ఎవరికి చెప్పుకోవాలో తెలియక ఇంటి దారి పడుతున్నారు. ఒకప్పుడు జిల్లావ్యాప్తంగా ఎంతో ప్రాచుర్యం పొందిన ఈ పథకం ఇప్పుడు నిరాదరణకు గురికాబడింది. అయితే ప్రభుత్వం నుంచి ప్రతి సంవత్సరం పథకం అమలు కోసం నిధులు విడుదలవుతూనే వున్నాయి.

ప్రభుత్వం విడుదల చేస్తున్న నిధులు మాత్రం ఖర్చు అవుతున్నట్లు లెక్కలు వున్నాయి. పాఠశాలలు, అంగన్‌వాడి కేంద్రాలలో మరుగుదొడ్లు నిర్మించిన అధికారులు నీటివసతి కల్పించలేకపోయారు. కొద్ది రోజులు మాత్రమే నీటిని సరఫరా చేసి అనంతరం దీని గురించి పట్టించుకోవడం మానేశారు. కోట్ల రూపాయల నిధులు వెచ్చించినా ప్రభుత్వ సంకల్పం మాత్రం నెరవేరకుండాపోతుంది.





దుర్వినియోగాన్ని ఆపని నెల్లూరులోని ఆర్‌డబ్ల్యుఎస్ కార్యాలయం. (ఫైల్ ఫోటో)

# జనం మెచ్చని 'విలన్'!



అల్లూరు రహీం

రామాయణ మహాకావ్యంలో రాక్షసుడు రావణుని కథానాయకునిగా చేసి సుప్రసిద్ధ దర్శకుడు మణిరత్నం, తన స్వంత బ్యానర్ మద్రాస్ టాకీస్‌పై తీసిన చిత్రమే విలన్. ఇది హిందీలో రావణ్‌గా, తమిళంలో రావణన్‌గా విడుదలయ్యింది. నటుల నటావిష్కరణ, అద్భుత లొకేషన్లు, సన్నివేశాల చిత్రీకరణపరంగా అంతర్జాతీయ స్థాయిలో వున్న విలన్ చిత్రం సామాన్య ప్రేక్షకునికి తలకెక్కదు. పదితలలు పది ఆలోచనలంటే కుదురుతుందా? సినిమా అంటే జనరంజకంగా వుండాలి కదా? సీరియస్‌నెస్ విలన్‌లో ఎక్కువయ్యింది. గీతాంజలి తర్వాత తాను తెలుగులో దర్శకత్వం చేసిన చిత్రం విలన్ అని దర్శకుడు మణిరత్నం చెప్పుకొన్నా ఈ సినిమా చూసే ప్రేక్షకులకు డబ్బింగ్ సినిమా చూసిన అనుభూతే కలుగుతుంది. శ్రీరామకృష్ణ మాటలు ప్రేక్షకులను మెప్పించలేకపోయాయి. కాని ఈ చిత్రంలో దేశంలోని కేరళ, కర్నాటక, మహారాష్ట్ర అడవుల్లోని అత్యద్భుత అందాలను తెరపై ఆవిష్కరించిన తీరు చూడను రెండుకళ్లు చాలవు. హోయలొలికే జలపాతాలు, అందులో అలవోకగా హీరో, హీరోయిన్లు ఏ మాత్రం డూప్‌లు లేకుండా దూకే సన్నివేశాలు రోమాంచితాలే. అదేవిధంగా రెండు ఓడలు ఢీకొట్టుకొనే సన్నివేశం, రెండు లోయల మధ్య విలన్ చిత్రం కోసమే నిర్మించిన బ్రిడ్జిపై పతాక సన్నివేశాల చిత్రీకరణ బాగుంది. ఈ సినిమా కోసం రెండేళ్లపాటు అరణ్యవాసం చేసిన దర్శకుడు మణిరత్నం, అద్భుత చిత్రీకరణతో మంత్రముగ్ధులను చేసిన కెమెరామెన్లు సంతోష్‌శివన్, మణికందన్‌ను ప్రశంసించకుండా వుండలేం. పాటల రచయిత స్వర్గీయ వేటూరి సుందరరామ్మూర్తి వ్రాసిన ధీర... ధీర, కళ్లు పుడితే, గుణగుణ చరణాలతో సాగే గీతాలకు సంగీత దర్శకుడు ఎ.ఆర్.రెహ్మాన్ అద్భుతంగా స్వరపరిచాడు. అయితే ఈ చిత్రపాటలు తమిళవర్షన్‌లోనే వినసొంపుగా వున్నాయి. నటనాపరంగా విక్రమ్, ఐశ్వర్యరాయ్, పృధ్వీరాజ్ చౌహాన్ పోటీపడి నటించారనే దానికన్నా వారి నుంచి దర్శకుడు మణిరత్నం నటనను రాబట్టుకొన్నారని చెప్పాల్సి వస్తుంది. ఈ చిత్రంలో విక్రమ్ నటన ముందు ఐశ్వర్యరాయ్ తగ్గిందనాలి. పలు సంఘర్షణల తర్వాత ఈ చిత్రంలో సీత పాత్రను పోలిన రాగిణి (ఐశ్వర్యరాయ్)కు రావణుని వ్యక్తిత్వమే నచ్చడం సాంప్రదాయ ప్రేక్షకుల్లో అలజడిరేగుతుంది. సకలగుణాభిరాముడు, సీతమ్మ తల్లిని అగ్ని పరీక్షకు గురిచెయ్యడం లోకులను సంతృప్తిపరచననే విషయాన్ని విలన్‌లో మణిరత్నం స్త్రీల వ్యక్తిత్వ హననంగా చిత్రీకరించారు.




చిత్రకథలోనికి వెళ్తే పెనుగొండ ప్రాంతంలోని అడవుల్లో వుండే ఆటవీకుడు వీరయ్య (విక్రమ్) అక్కడి ప్రత్యేక సామ్రాజ్యాధినేత. కాని ప్రభుత్వం అతణ్ని ఓ సంఘవిద్రోహిగా, తీవ్రవాదిగా, దోపిడీదారునిగా పరిగణిస్తుంది. ఆయన చెల్లెలు వెన్నెల (ప్రియమణి) ఓ నాగరికుణ్ని ప్రేమిస్తుంది. వీరి పెళ్లిలోనే ఎస్పీ దేవ్ (పృధ్వీరాజ్ చౌహాన్) వీరయ్యను అంతమొందించను పోలీస్ బెటాలియన్‌తో సహా వస్తాడు. వీరయ్య గొంతులోకి గురిచూసి కాల్చినా ఆయన తప్పించుకొంటాడు. పోలీస్ ఠాణాలో వెన్నెలను పోలీసులు దారుణంగా చెరుస్తారు. ఆమె బావిలో దూకి ఆత్మహత్య చేసుకొంటుంది. దీన్ని భరించలేని వీరయ్య ఎస్పీ దేవ్ భార్య రాగిణి (ఐశ్వర్యరాయ్)ను కిడ్నాప్ చేస్తాడు. కాని ఆమె అతడి నుంచి తప్పించుకోను పలు ప్రయత్నాలు చేసినా ఫలించవు. రాగిణి అందం వీరయ్యను వివశుణ్ని చేస్తుంది. ఇంతలో దేవ్ నల్లమల అడవుల గూర్చి బాగా తెలిసిన అటవీశాఖ వుద్యోగి జ్ఞానప్రకాష్ (కార్తీక్) సహకారంతో అన్వేషణ ప్రారంభిస్తాడు. కాని ఆయన ప్రయత్నాలు ఫలించవు. తెలివిగా వీరయ్య ఒకచోట నుంచి మరోచోటికి రాగిణిని మార్చేస్తుంటాడు. తన కుటుంబానికి పోలీసుల వల్ల జరిగిన అన్యాయాన్ని వీరయ్య వివరించగా రాగిణిలోని స్త్రీ హృదయం రోదిస్తుంది. జ్ఞానప్రకాష్ చేయ ప్రయత్నించే సంధి వికటిస్తుంది. దేవ్, వీరయ్యల మధ్య వీరోచిత పోరాటం జరిగినా వీరయ్య రాగిణిపై అభిమానంతో అతణ్ని ప్రాణాలతో వదిలేస్తాడు. రాగిణి 14రోజులపాటు వీరయ్యతో వుండడం పట్ల దేవ్ ఆమెను శీలపరీక్ష చేయించుకోమంటాడు. దీంతో తిరిగి వీరయ్య దగ్గరకు వెళ్లి తనపై తన భర్తకు ఏం చెప్పావని రాగిణి ప్రశ్నిస్తుంది. అంతిమంగా తన భర్తకన్నా వీరయ్యనే వ్యక్తిత్వమున్నవాడని గ్రహించేలోపే దేవ్ అతనిపై కాల్పులు జరుపుతాడు. లోయలోకి జారిపోకముందే వీరయ్య చేయి అందుకొనే ప్రయత్నంలో రాగిణి విఫలమవ్వడంతో శుభం కార్డు పడుతుంది.





## అనుష్కలో ఆనందం!

వేదం చిత్రంలో గ్లామర్ హీరోయిన్ అనుష్క పోషించిన వేశ్యపాత్ర అమలాపురం సరోజ అందర్నీ ఆకట్టుకొంది. ఈ విషయమై అనుష్క మాట్లాడుతూ ఈ పాత్ర పోషించమని దర్శకుడు క్రిష్ అడిగినపుడు ఛాలెంజింగ్ పాత్ర నన్ను వెతుక్కొంటూ వచ్చిందనిపించింది. మాటల్లో చెప్పలేని సంతోషం కలిగింది. ప్రేక్షకులు కచ్చితంగా నా పాత్రను ఆదరిస్తారనే నమ్మకం కల్గింది. సినిమా విడుదలయ్యాక అదే జరిగింది. ఈ పాత్ర పోషణకు నేనేమి పరిశోధనలు, వేశ్యలతో మాట్లాడడం వంటివి చేయలేదు. క్రిష్ సరోజ పాత్రను కళ్లకు కట్టినట్లు చేసి చూపేవారు. మొత్తానికి ఈ పాత్ర నా బరువు బాధ్యతలు పెంచింది. భవిష్యత్తులో సరోజ పాత్రను మించిన పాత్రలు చేయాల్సిన బాధ్యత తనపై పడిందంది.

## పోకిరిలా చూడకండి!



గోలీమార్ చిత్రం తనకు సంతృప్తి కల్గించిందంటున్నాడు దర్శకుడు పూరీ జగన్నాథ్. ఈ విషయమై మాట్లాడుతూ కచ్చితమైన హిట్ ఫార్ములా ఏంటో ఎవరికి తెలియదని నా అభిప్రాయం. పోకిరి సినిమా నుంచి బయటకు రాలేకపోతున్నది నేను కాదు ప్రేక్షకులు. ప్రతి సినిమాను పోకిరి దృష్టితో చూస్తే అలాగే వుంటుంది. ఆ సినిమాను తలచుకొంటూ నా మిగతా సినిమాలకు రావద్దని ప్రేక్షకులకు నా అభ్యర్థన. మహేష్‌బాబుతో నా సినిమా బహుశా 2011 వుండవచ్చని సూచనప్రాయంగా చెప్పాడు పూరీజగన్నాథ్.

## బెట్టు చూపిస్తున్న పార్వతిమెల్టన్



జల్సా చిత్రంలో హీరోయిన్ పార్వతి మెల్టన్‌కు ఈ సినిమా తర్వాత తెలుగులో మరో చిత్రం రాలేదు. బాలీవుడ్ వెళ్తునానంటూ బోలెడు కబుర్లు చెప్పిన మెల్టన్‌కు భంగపాటే ఎదురయ్యింది. చాలా కాలంగా ఖాళీగా వుంటున్న ఈవిడ రావాల్సిన ఆదాయాన్ని అతి తక్కువ కాలంలోనే లాగేయాలన్న ఆలోచనతో షెడ్యూల్‌కు రోజుల చెప్పున రేట్లు ఫిక్స్ చేసుకొని కూర్చొంది. టాలీవుడ్‌లో ఏ ప్రాజెక్టు చేయడానికైనా సిద్ధమే. కాని రోజుకు లక్షన్నర ఇవ్వాలని బెట్టు చేస్తుంది. రేటు సడలిస్తే పార్వతికి తెలుగులో అవకాశాలు దక్కుతాయి.



## అక్షయ్‌తోనే బాగుంటా!

వరుసగా ఏడు చిత్రాల హిట్‌తో హీరోయిన్ కత్రీనాకైఫ్ బాలీవుడ్‌లో దూసుకపోతుంది. ఈ మధ్య విడుదలైన రాజ్‌నీతి చిత్రం కూడా ఆమెకు మంచి పేరు తెచ్చిపెట్టింది. ఆసియాలోనే అత్యంత అందమైన మహిళగా అవార్డు పొందిన కత్రీనాను బాలీవుడ్‌లో ఆమెకు ఇష్టమైన నటుడు ఎవరంటే – టక్కున అక్షయకుమార్ అని సమాధానం చెప్పింది. ఇది విని సల్మాన్‌ఖాన్ ఏమనుకొంటాడో అంటే... మా ఇద్దరి కాంబినేషన్ బాగుంటుందని ఎన్నో చిత్రాలు నిరూపించాయి. అతనితో పని చేస్తున్నంత సేపు ఏ సమస్య వుండదు. బాగా అర్థం చేసుకొనే మనస్తత్వం అక్షయ్‌దని గొప్పగా చెప్పింది.

## నటిగా నిరూపించుకొంటా!



సిద్దూ ఫ్రమ్ శ్రీకాకుళం చిత్రంలో హీరోయిన్ మంజరి తన ధోరణికి విరుద్ధంగా దర్శకుడు కె.విశ్వనాథ్ తీస్తున్న శుభప్రదం చిత్రంలో హీరోయిన్‌గా నటిస్తుంది. నిండుగా చీరకట్టుకొని సెట్‌లో కనపడ్డ ఆమెను కదిలించగా ముద్దులిస్తేనే, బికినీలేస్తేనే, ఎక్స్‌పోజింగ్ చేస్తేనే నాయికగా నిలుస్తారా? దీన్ని నేను నమ్మను. ఏం చేసినా, ఎలా నటించినా పాత్ర చిత్రాన్ని బట్టి వుండాలి. ఊరికే అవసరం లేకుండా ఏవేవో వేషాలు వేయలేను. ఆ దారిలో నడచి నాయికగా పేరుపొందాలని లేదు. గ్లామర్‌వి చేస్తూనే అభినయాన్ని చేయగల సత్తా వున్న నటిగా నిరూపించుకొంటా. శుభప్రదంలో నేను చేస్తున్న ఇటువంటి పాత్ర నటిగా నాకు మంచి గుర్తింపు తెస్తుందంటుంది మంజరి.


కిషన్‌రెడ్డిని సన్మానిస్తున్న బిజెపి కార్యకర్తలు.

# నెల్లూరులో కిషన్‌రెడ్డి హల్‌చల్!

అన్ని రాజకీయ పార్టీలు మునిసిపల్ ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని క్యాడ ర్‌ను బలోపేతం చేసేందుకు సమాయత్తం అవుతున్నాయి. అధికార కాంగ్రెస్ పార్టీతోపాటు తెలుగుదేశం, బిజెపి, కమ్యూనిస్టుపార్టీలు కార్యకర్తలను చైతన్య పరచేందుకు పార్టీని బలోపేతం చేసేందుకు పలురకాల కార్యక్రమాలు నిర్వహి స్తున్నాయి. ముఖ్యంగా బిజెపి గత ప్రాభవాన్ని పొందేందుకు, కోల్పోయిన క్యాడ ర్‌ను తిరిగి పొందేందుకు సమాయత్తం అవుతున్నది. రాష్ట్ర అధ్యక్షుడుగా బాధ్య తలు చేపట్టిన యువనాయకుడు గంగాపురం కిషన్‌రెడ్డి జిల్లా పర్యటన అదుగడు

## దళితులు, మైనార్టీల ఇళ్లకు వెళ్లి టీ, టిఫిన్ చేశారు.

గునా కార్యకర్తలను ఉత్సాహపరచే దిశగా సాగడం ఇందులో భాగమే. గతంలో ఏ అధ్యక్షుడు జరపనివిధంగా నగరంలో వున్న రెండురోజులు ఆయన సామాన్య కార్యకర్తలతో గడిపేందుకు ఎక్కువ సమయం కేటాయించాడు. స్టోన్‌హౌస్‌పేట, సంతపేటలో కార్యకర్తల ఇళ్లకు టిఫిన్, భోజనానికి వెళ్లిన ఆయన దళిత, మైనార్టీ వర్గాలను పార్టీకి దగ్గర చేసేందుకు కష్టపడ్డాడు. పార్టీ జిల్లా అధ్యక్షుడు ఆంజనేయరెడ్డి తదితరులు కిషన్‌రెడ్డితోపాటు ముస్లిం యువకులను, దళిత వర్గాల ప్రజలను ఆకట్టుకొనేందుకు పలు ప్రయత్నాలు చేయడం నగర వాసు లకు నవ్వు తెప్పించింది. అంతా ఓట్ల మహిమ అని వ్యాఖ్యానించుకొన్నారు.

# రవిప్రకాష్ రిటైర్‌మెంట్‌కు కానుక కోసం దండకాలు!

జిల్లాలో హౌసింగ్ కార్పొరేషన్ అధికారుల అవినీతి సంపాదన లక్షల్లోనే వుంటుందన్న సం గతి తెలిసిందే. ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణాలు, పేదల పక్కాగృహాల నిర్మాణాల పేరుతో చిన్న ఉద్యోగి నుంచి ఉన్నతాధికారి వరకు లక్షలు దిగమింగు తుంటారు. ఇప్పుడు ఆ శాఖ ప్రత్యేకాధికారిగా వున్న రవిప్రకాష్ జూన్ నెలాఖరుకు రిటైర్ కానుం డడంతో ఆశాఖ అధికారులు ఆయనకు నజరానా సమర్పించుకొనేందుకు సిద్ధమయ్యారు. ఆత్మకూరు, వింజమూరు డిఇలు రంగవరప్రసాద్, మోహన్‌రా వులు రవిప్రకాష్‌పై తమ భక్తి ప్రపత్తులను చాటు కొనేందుకు ఏదైనా భారీ కానుక ఇవ్వాలని నిర్ణ యించి జిల్లాలోని ఎఇలందరికి ఒక్కొక్కరు 12వేల రూపాయలు మామూలు ఇవ్వాలని మౌఖిక ఆదే శాలు జారీ చేశారట. వీరు నిర్ణయించిన రేటు విని మండలాల్లోని ఎఇలు నోరెళ్ళబెడుతున్నారు. అంతో ఇంతో సంపాదిస్తున్నమాట వాస్తవమే అయినా 12 వేలంటే ఎక్కడనుంచి తెచ్చివ్వాలని వాపోతున్నారు. దాదాపు 6లక్షల రూపాయల మేర ఈవిధంగా వసూలు చేసి రవిప్రకాష్‌కు కారు గానీ, లేదా మరో భారీ కానుక గాని కొనివ్వాలని అధికారులు భావిస్తున్నట్లు సమాచారం. జిల్లాలో చాలా ఏళ్లుగా పాతుకపోయిన రవిప్రకాష్ హౌసింగ్ ప్రత్యేకాధికారిగా వుంటూ రెండు చేతులా సంపాదించాడని కోడైకూస్తున్నారు. తన పదవిపై మోజు తీరక ఆయన పుట్టినతేది తప్పుగా నమోదైందని, సర్వీసు పొడిగించాలని కూడా ప్రభుత్వానికి దరఖాస్తు చేసుకొన్నా అది సఫలం కాలేదు. ఆది నుంచి వివాదాస్పదుడిగా పేరు గడిం చిన ఆయన రిటైర్‌మెంట్‌ను సైతం దండకాలతో ముగిస్తూ తనకు తానే సాటి అన్పించుకొన్నాడు.


కర్నాటక నుంచి రాజ్యసభ సభ్యునిగా ఎన్నికైన వెంకయ్యనాయుడికి బెంగుళూరు విధానసౌధలో పుష్పగుచ్ఛం ఇచ్చి అభినందిస్తున్న బెంగుళూరులో స్థిరపడ్డ నెల్లూరీయుడు రావి మోహన్ చౌదరి.


టెన్త్ పరీక్షలో 585 మార్కులు సాధించిన నెల్లూరు శ్రీరాఘవ టాలెంట్ స్కూల్ విద్యార్థి సుమంత్‌ను అభినందిస్తున్న ముఖ్యమంత్రి రోశయ్య. ప్రక్కన స్కూల్ కరస్పాండెంట్ కె.దశరథరామయ్య వున్నారు.


రామచంద్రారెడ్డి హాస్పిటల్ ఓ.పిలో కిటకిటలాడుతున్న రోగులు.

# రోగాల బారిన ప్రజలు!

నగరవాసులను పలు రోగాలు చుట్టుముట్టడంతో అల్లాడిపోతున్నారు. పలు ప్రాంతాలలో మంచినీటి సరఫరా చేసే పైపులు ధ్వంసమై మురుగునీరు చేరడంతో నీరు కలుషితమైపోయి అతిసార ప్రబలడంతో జనం ఆస్పత్రుల్లో చికిత్స పొందుతున్నారు. వాంతులు, విరోచనాలకు గురై వచ్చేవారితో ఆస్పత్రు లన్నీ కిటకిటలాడుతున్నాయి. దీనికి తోడు వాతావరణంలో మార్పులు కార ణంగా విషజ్వరాలు ప్రజలను వణికిస్తున్నాయి. జలుబు, గొంతునొప్పి, జ్వరా లతో బాధపడే వారి సంఖ్య అధికంగా వుంది. చిన్నపిల్లలు సైతం జ్వరాల బారిన పడడం, అతిసారకు గురౌతుండడంతో పలు చిన్నపిల్లల ఆస్పత్రులు, రామచంద్రారెడ్డి, జయభారత్, నారాయణ హాస్పిటళ్లలో రోగులు చికిత్స పొం దుతున్నారు. ఎన్నికల సమయంలో నగరాన్ని సుందరనందనంగా తీర్చిదిద్దుతా మని చెప్పే నేతలకు నగరప్రజలు పడే బాధలు కన్పించకపోవడం సిగ్గుచేటు. రోడ్లలో విగ్రహాలు పెట్టించడంలో చూపే శ్రద్ధ నగర ప్రజలకు కలుషితం కాని త్రాగునీటిని అందించడంలో చూపకపోవడంతో ప్రజలు అంటురోగాలబారిన పడాల్సి వస్తోంది.

# ఎయిడ్స్ ఆదరణ కేంద్రం మూసివేత!

## విచారణలో ఆరోపణలు నిజమని తేలాయి

ఎయిడ్స్, హెచ్ఐవి బాధితులకు ఆశ్రయం కల్పించేందుకు ఏర్పాటు చేసిన ఆదరణ కేంద్రాన్ని కేంద్రప్రభుత్వం మూసేయాలని ఆదేశాలు జారీ చేసింది. బోగోలు మండలం ముంగమూరు తోటల వద్ద జాతీయ రహదారి ప్రక్కన భవాని ఎడ్యుకేషనల్ సొసైటీ ఆధ్వ ర్యంలో ఎయిడ్స్ బాధితులకు ఆశ్రయం కల్పించేందుకు కేంద్రాన్ని ఏర్పాటు చేయడం జరిగింది. దీని నిర్వాహకుడిగా వున్న సింహాద్రి ఇందిరాక్రాంతి పథంలో ఎ.పి.ఎంగా విధులు నిర్వహిస్తున్నాడు.

ఒక ప్రక్క ప్రభుత్వ ఉద్యోగం చేస్తూ మరో ప్రక్క ఆదరణ కేంద్రాన్ని నడుపుతున్నాడు. బాధితుల పునరావాసం కోసం కేంద్ర ప్రభుత్వం విడుదల చేస్తున్న నిధులు దుర్వినియోగం జరిగినట్లు సర్వేలో తేలడంతో దీనిని వెంటనే మూసివేయాలని జిల్లా కలెక్ట ర్‌కు ఆదేశాలు పంపింది. ఎయిడ్స్, హెచ్ఐవి బాధితులు కేం ద్రంలో పునరావాసం పొందకపోయినా, పొందినట్లు బోగస్ రికా ర్డులు సృష్టించి నిధులు మంజూరు చేయించుకునేవాడు. ఆదరణ కేంద్రంపై గతంలో అనేక ఆరోపణలు వచ్చినప్పటికి అధికారులను మంచి చేసుకొని సర్దుబాటు చేయించుకునే వాడు.

ఆదరణ కేంద్రం నిర్వహణ ద్వార సంపాదించిన డబ్బుతో బోగోలు మండలంలో ఆస్తులు కూడబెట్టుకున్నట్లు అధికారులకు ఫిర్యాదులు కూడా అందాయి. కేంద్ర మానవ వనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖ పూర్తి సర్వే చేయించడంతో ఆరోపణలు నిర్ధారణ జరిగింది. దీంతో భవిష్యత్‌లో ఎటువంటి నిధులు మంజూరు చేయ కుండా, కేంద్రాన్ని మూసివేయాలని ఆదేశించింది.

● నెల్లూరులో

# నోట్‌బుక్ హీరోయిన్!

తన నట జీవితంలో నాగమ్మ టివి సీరియల్‌లో పోషించిన టైటిల్‌రోల్ మంచి పేరు తెచ్చిపెట్టిందని హీరోయిన్ గాయత్రి తెలి పింది. పలు సీరియళ్లు, సినిమాల్లో బాల నటిగా వివిధ పాత్రలు పోషించి నోట్‌బుక్‌తో హీరోయిన్‌గా తెలుగు తెరకు పరిచయం అయిన ఈ అచ్చతెలుగు అమ్మాయి నగరానికి విచ్చేసిన సంద ర్భంగా పలు అంశాలు వెల్లడించింది. మాది శ్రీకాళహస్తి. చంద్రా రెడ్డి, పార్వతి నా తల్లిదండ్రులు. మేము మద్రాసులో స్థిరపడ్డాం. చిన్ననాటి నుంచి అక్కడే పెరిగాను. బాలనటిగా పలు సినిమాలు, సీరియళ్లలో నటించాను. దాసరి నారాయణరావు దర్శకత్వం వహించిన రౌడీదర్బార్, గ్రీకువీరుడు చిత్రాల్లో నటించినా ప్రముఖ మ్యూజిక్ డైరెక్టర్ కోటి తనయుడు రాజీవ్ నటించి చందూ దర్శకత్వం వహించిన నోట్‌బుక్ సినిమాతో హీరోయిన్‌గా తెరం గేట్రం చేశాను. తమిళంలో భారతి సినిమాలో చక్కని నటన ప్రద ర్శించినందుకు అక్కడి ప్రభుత్వ అవార్డు అందుకోవడం సంతోష కరం. తెలుగు వారికి దగ్గర కావాలన్నదే నా కోరిక. మంచి చిత్రాలు, మంచి పాత్రల కోసం ఎదురు చూస్తున్నానంది.

## తెలుగుదేశానికి తెగులు

16వ పేజీ కొరవ

చాలంటే 2014 వరకు రోశయ్య సుఖంగా పాలన చేయాలని చంద్రబాబు అభిప్రాయమని చెప్తారు. అందువల్లనే ఆయన ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టే ఏ చర్యకూ ఉపక్రమించడం లేదు. 2014 వరకు రోశయ్య ఇట్లనే కుంటుకుంటూ పాలన సాగిస్తే, విసిగిపోయిన ప్రజలు తనకు పట్టం కడ తారని 1994లో వలె అధికారాన్ని పళ్లెంలో పెట్టి చేతికి అందిస్తారని భావిస్తున్నారట ఆయన.

అయితే ఈ ధోరణి తెలుగుదేశం నాయ కులు, కార్యకర్తలకు ఎంత మాత్రం నచ్చడం లేదు. అన్ని సంవత్సరాల పాటు పార్టీని నిద్రాణంగా వుంచి, కాంగ్రెస్ మీద వ్యతిరేకతతో తమకు ఓట్లు వేయమని ప్రజల వద్దకు వెళ్తే, ముఖాన పేడ నీళ్లు చల్లుతారని వారి భయం. ప్రభుత్వంలో రోశయ్య వున్నా, జగన్ వచ్చినా తమకు అనవసరమని, ప్రభుత్వ అవకతవకలను ఎప్పటికప్పుడు ఎత్తి చూపగలిగితేనే ప్రజలు తమను ఆదరిస్తారని వారి ఆలోచన. కానీ అందుకు చంద్రబాబు సహకరిం చడం లేదు. పార్టీ కార్యకర్తలలో ఉత్తేజం నింపడా నికి ఏ మాత్రం ప్రయత్నం చేయడం లేదు. ఒక రకంగా చెప్పాలంటే తెలుగుదేశం పార్టీకి ఏదో తెలి యని తెగులు తగిలిందా అన్పిస్తున్నది పరిస్థితి చూస్తుంటే.

## జనవాణి

3వ పేజీ కొరవ

వారు నష్టపోయేలా చేస్తున్నారు. నెల్లూరు మసూరి రకం బియ్యం కిలో బహిరంగ మార్కెట్‌లో 30 రూపా యలకు అమ్ముతున్నారు. కానీ ఈ ధాన్యాన్ని ఇటు మిల్లర్లు, ఎఫ్‌సిఐ పుట్టి పదివేల రూపాయలకు కూడా కొనడం లేదు. పండించిన పంట నిల్వ చేయను రాష్ట్రంలోనూ, జిల్లాలోనూ తగినన్ని గోడౌన్లు లేవు. ఇప్పటికైనా నాబార్డు, ప్రభుత్వ బ్యాంకులు తక్కువ వడ్డీకి రైతు సంఘాలకు సమిష్టిగా గోడౌన్లు కట్టు కొంటారు. మిల్లర్లు, ఎఫ్‌సిఐ కర్ర పెత్తనం కొనసాగి నన్నినాళ్లు రైతుకు గిట్టుబాటు ధర దొరకదు.

వాస్తు రామచంద్ర — నెల్లూరు

### విత్తనాలు సరఫరా చేయండి!

ఋతుపవనాలు సకాలంలో వచ్చాయి. రాష్ట్ర మంతటా వర్షాలు పడ్డాయి. రైతులు భూములను దున్ని దుక్కి చేస్తారు. మృగశిర కార్తెలో మెట్ట భూముల్లో విత్తనాలు వేస్తారు. కానీ రైతుల వద్ద విత్తనాలు లేవు. ప్రభుత్వ పంపిణీ కేంద్రాలలో విత్త నాలు లేవు. ఇటీవల ప్రభుత్వం సరఫరా చేస్తున్న విత్తనాలు మొలకెత్తడం లేదు. సకాలానికి రైతులకు విత్తనాలు, ఎరువులు కూడా ప్రభుత్వం అందించలే కుంటే ప్రభుత్వముండి ప్రయోజనమేమి?

కె.వి.సుబ్బారెడ్డి — గుంపర్లపాడు

### ఫీజు రీయింబర్స్‌మెంట్ చేయాలి!

గత విద్యా సంవత్సరం ప్రారంభంలోనే జిల్లాలోని ప్రైవేట్ అన్ ఎయిడెడ్ డిగ్రీ కళాశాలలో చదివే ఎస్సీ, ఎస్టీ, మైనారిటీ, ఇబిసి విద్యార్థులకు ప్రభుత్వమే ఫీజులు రీయింబర్స్‌మెంట్ చేస్తుంద న్నారు. కళాశాలల యాజమాన్యాలు ఎట్టి పరిస్థితు లలో విద్యార్థుల వద్ద నుండి ఫీజులు వసూలు చేయరాదని ప్రకటించారు. కాని ఇంతవరకు ఫీజు రీయింబర్స్‌మెంట్ జరగలేదు. ఒక్కొక్క కళాశాలకు పది లక్షల నుండి కోటిరూపాయలకు పైబడి ఫీజు రీయింబర్స్‌మెంట్ రావాలి. ప్రభుత్వం ఫీజు రీయిం బర్స్‌మెంట్ చేస్తేనే ఈ యేడాది ప్రైవేట్ డిగ్రీ కాలే జీలు నడుస్తాయి.

ఆచార్య ఆదిత్య, — నెల్లూరు

### ఓదార్పుతో మేలు!

కడప లోక్‌సభ సభ్యుడు వైఎస్ జగన్మోహన్ రెడ్డి చేపట్టిన ఓదార్పు యాత్రకు ఆటంకాలు కల్పిం చడం తగదు. స్వర్గీయ రాజశేఖర్‌రెడ్డి రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీని రెండుసార్లు అధికారంలోకి తీసుకొ చ్చారు. ఆయన అకాల మరణంతో చనిపోయిన కుటుంబాలను ఓదార్చవలసిన బాధ్యత వైఎస్ జగ న్మోహన్‌రెడ్డిపై వుంది. ఓదార్పు యాత్రతో కాంగ్రెస్ పార్టీకి మేలు తప్ప కీడు జరుగదు. ఈ యాత్రకు అధిష్టానం గ్రీన్ సిగ్నల్ ఇవ్వాలి.

*బి.శాలి,* — *కావలి.*

### టిటిడికి విజ్ఞప్తి!

ప్రపంచంలోనే అత్యధిక కానుకలొచ్చే దేవ స్థానం తిరుమల తిరుపతి దేవస్థానం. జనమే తమ శక్తి మేర కలియుగ దైవం వెంకటేశ్వరస్వామికి కానుకలు సమర్పిస్తుంటారు. కానీ టిటిడి పాలక మండలి పనికిమాలిన పథకాలకు ఆ డబ్బులు ఖర్చు పెట్టేస్తుంది. ఆ విధంగా కాక రాష్ట్రంలో మంచినీటి సదుపాయం లేక అల్లాడుతున్న గ్రామాలను గుర్తించి ఆ గ్రామాల్లో వెంకటేశ్వర జలధార పేరిట ఓ కార్య క్రమానికి రూపకల్పన చేస్తే బాగుంటుంది. ఫ్లోరైడ్ సమస్యను పరిష్కరించడంలో ప్రభుత్వాలు విఫలమ య్యాయి. ఈ సమస్యను సైతం 'వెంకటేశ్వర జల ధార' కార్యక్రమంలో పరిష్కరిస్తే ప్రజల డబ్బు ప్రజో పయోగ కార్యక్రమాలకు ఖర్చు పెట్టినట్లవుతుంది.

పి.అరుణకుమారి — నెల్లూరు

## మా పార్టీని ఓడించు

మొదటి పేజీ కొరవ

పార్టీలలో కొంతమంది అభ్యర్థులు బలంగా వున్నారు. నిజామాబాద్‌లో డిఎస్, ఆదిలాబాద్‌లో కొనప్ప, ఇంద్రకరణ్‌రెడ్డి, తెలుగు దేశం పార్టీలో గోనె హనుమంత రావు, దయాకరరావు వంటి అభ్య ర్థులు ప్రజలలో పలుకుబడి కలిగి వున్నారని సమాచారం. అటు వంటి చోట్ల తెలంగాణ సెంటి మెంట్ కంటే, వీరి పట్ల ఓటర్లలో కన్పిస్తున్న సానుభూతే కీలకపాత్ర పోషిస్తుందని అంచనా. అదే జరి గితే టిఆర్ఎస్ మట్టి కరవడం ఖాయం.





**రాజీవ్‌భవన్ నేతృత్వంలో మురికి కాలువల్లో దోమల నిర్మూలనకు ఆయిల్ బాల్స్ వేస్తున్న కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, వై.రామిరెడ్డి తదితరులు.**

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

పసుపు కుంకుమల ఉత్సవం, జూలై 1వ తేది పొం గళ్లు, బండలాగు పందాలు జరుగుతాయని వ్యవ స్థాపక ధర్మకర్తలు, కార్య నిర్వహణాధికారి చెప్పారు.

### ఎస్ఐ హసనయ్య ద్వితీయ వర్ధంతి

38 ఏళ్లుగా పోలీసు శాఖలో పనిచేసి ఎస్ఐగా రిటైర్ అయిన పిక్కిలి హసనయ్య ద్వితీయ వర్ధంతిని పురస్కరించుకొని 26వ తేది నెల్లూరు నవాబుపేట లోని షిర్డిసాయినగర్‌లో హసనయ్య చారిటబుల్ ట్రస్ట్ నేతృత్వంలో అన్నదానం, వస్త్రదానం జరుగు తాయని ట్రస్ట్ కార్యదర్శి పిక్కిలి రాజ తెలిపారు.

### మాయమై దొరికిన పసికందు

తల్లి పొత్తిళ్లలో వున్న పసికందు మాయమై దొరికిన వైనం నగరంలో చోటుచేసుకొంది. మూలా పేటకు చెందిన ఆయేషా రామచంద్రారెడ్డి హాస్పిట ల్‌లో బిడ్డకు జన్మనిచ్చిన అనంతరం వైద్య చికిత్స అవసరమై ఐసియుకు తరలించారు. ఈ పరిస్థి తుల్లో అపరిచిత మహిళ బిడ్డను అపహరించుకొని వెళ్లడంతో బాధితులు పోలీసులను ఆశ్రయించారు. త్రీ టౌన్ పోలీసులు నిఘా పెట్టడంతో శ్రామిక నగర్‌లో బిడ్డను కనుగొని పట్టుకొని అపహరించిన మహిళను అరెస్టు చేశారు.

### టిసి అడిగినందుకు చావబాదిన టీచర్

ఇటీవల కాలంలో టీచర్లు తమ బాధ్యతలను విస్మరించి వ్యవహరించడమేగాక గౌరవ ప్రదమైన వృత్తికి కళంకం తెస్తున్నారు అనేందుకు తోటపల్లి గూడూరులో జరిగిన ఈ ఘటన ఉదాహరణ. మాచర్లవారిపాళెంకు చెందిన ప్రవల్లిక తోటపల్లి గూడూరు జిల్లా పరిషత్ స్కూలులో పదవ తరగతి పాసైంది. ఆ విద్యార్థిని ఇంటర్ చేరేందుకు టిసి కోసం వెళ్లగా పలుమార్లు ప్రధానోపాధ్యాయురాలు సురేఖాదేవి త్రిప్పుకొంటుండడంతో ఆ అమ్మాయి గట్టిగా అడగడంతో కోపోద్రిక్తురాలైన టీచర్ ఎడా పెడా విద్యార్థినిని చావ బాదడంతో తోటపల్లి గూడూరు పోలీస్‌స్టేషన్‌లో బాధితురాలు ఫిర్యాదు చేసింది.

## విద్యాలయ ప్రవేశానికి లాటరీ విధానమా?

మద్యం టెండర్లలో షాపుల కేటాయింపుకు ప్రవేశపెట్టిన విధంగా గురుకుల ప్రవేశానికై విద్యా ర్థులకు లాటరీ విధానం ప్రవేశ పెట్టడం ఏమిటని బిజెపి ప్రశ్నించింది. జిల్లా ప్రధాన కార్యదర్శి రమేష్ తదితరులు దీనిపై అదనపు జెసి సీతారామయ్యను కలసి వినతిపత్రం సమర్పించారు. గురుకుల ప్రవేశ పరీక్షలపై ప్రభుత్వం ఏ నిర్ణయం ప్రకటించకపోవడం వల్ల విద్యార్థులు ఆందోళన చెందుతున్నారన్నారు. లాటరీ విధానం విద్యావ్యవస్థలో పనికిరాదని పున రాలోచన చేయాలని కోరారు.

### విద్యార్థుల బిక్షాటన

బిసి విద్యార్థులకు ఫీజు రీయంబర్స్‌మెంటు అందజేయాలని డిమాండ్ చేస్తూ టిఎస్ఎస్ఎఫ్ విద్యార్థులు నగరంలో వినూత్నంగా బిక్షాటన చేప ట్టారు. అర్ధనగ్నంగా మారిన విద్యార్థి నాయకులు ప్రజల నుంచి బిక్షమెత్తుతూ తమ నిరసన తెలి పారు.

### ఎస్ఎఫ్ఐ ముట్టడి

గుర్తింపులేని పాఠశాలలపై చర్యలు చేపట్ట డంలో విద్యాశాఖ అధికారుల వైఖరిని నిరసిస్తూ ఎస్ఎఫ్ఐ డిఇఓ కార్యాలయాన్ని ముట్టడించింది. జిల్లావ్యాప్తంగా 170 పాఠశాలలు ప్రభుత్వ గుర్తింపు లేనివిగా ప్రకటించిన విద్యాశాఖ ఆ పాఠశాలలపై చర్యలు చేపట్టడంలో మీనమేషాలు లెక్కిస్తుందని విమర్శించారు. విద్యాశాఖాధికారులు అవినీతి కార ణంగానే చర్యలు తీసుకోనేందుకు వెనుకాడుతున్నా రని ఆరోపించారు. విద్యార్థులు అధిక సంఖ్యలో చేరి నినాదాలతో దద్దరిల్ల చేయడంతో డిఇఓ బాల కాశయ్య వారితో మాట్లాడి శాంతింప చేశారు.

### జలదంకి కరణం మరణం

పాతతరం కాంగ్రెస్‌వాది, చాలాకాలం పాటు జలదంకి కరణంగా పనిచేసిన ధూర్జటి మల్లిఖార్జున రావు(93) 19వ తేది మరణించారు. ఆయనకు ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు. కుటుంబ పెద్దను కోల్పోయిన వీరి కుటుంబానికి మా సాను భూతి.

# ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను నిలిపివేయాలి!


మావోయిస్టుల వేటలో ప్రత్యేక పోలీసు దళం.

నక్సల్స్ అణచివేత పేరుతో కేంద్ర ప్రభుత్వాలు అమాయక గిరిజనుల జీవితాలను ఛిద్రం చేస్తున్నాయి. గ్రీన్‌హంట్ పేరుతో కేంద్ర హోంమంత్రి చిదంబరం సాగిస్తున్న దారుణ మారణకాండ చూస్తుంటే దేశాల మధ్య యుద్ధం జరుగుతుందా అన్న రీతిలో వేలాది సాయుధ బలగాలను, పారామిలటరీ దళాలను, గ్రేహౌండ్స్ సిబ్బందిని దించి ఛత్తీస్‌ఘడ్, ఒరిస్సా, ఆంధ్ర రాష్ట్రాల అడవుల్లో జల్లెడ పట్టి గాలిస్తున్నాయి. ప్రకృతి ఒడిలో జీవిస్తున్న అమాయక గిరిజనులు ఈ కారణంగా బలై పోతున్నారు. ఇంత చేస్తున్న కేంద్ర ప్రభుత్వం నక్సల్స్ అణచివేత పేరు చెప్తున్నా అసలు నిజం మాత్రం అడవుల్లోని ఖనిజ సంపదను బహుళ జాతి సంస్థలు, బడా పారిశ్రామికవేత్తలకు దోచిపెట్టడానికే అన్నది జగమెరిగిన సత్యం. విదేశీ కంపెనీలైన వేదాంత, జిందాల్, ఆర్సెల్ మిట్టల్, రసల్ ఖైమా లాంటి సంస్థలకు విలువైన ఖనిజ సంపదను దోచిపెట్టాలంటే అమాయక గిరిజనులను అడవి నుంచి తరిమి వేయాలి. ప్రభుత్వ కుట్రను అడ్డుకొని గిరిజనులకు వెన్నుదన్నుగా నక్సల్ నిలబడుతున్నారు. దీంతో నక్సల్స్‌ను అణచివేయనిదే అడవుల్లోని ఖనిజ సంపదైన మాంగనీస్, బాక్సైట్, ఐరన్ ఓర్‌ను తరలించలేమని భావించిన హోంమంత్రి చిదంబరం నక్సల్స్‌పై ఎన్నడూలేని విధంగా యుద్ధం ప్రకటించాడు. దీనికి దంతెవాడ ఘటనతో ప్రభుత్వం తగిన మూల్యం చెల్లించుకోవాల్సి వచ్చింది. 76 మంది సిఆర్‌పిఎఫ్ జవానులు బలైనప్పటికీ కేంద్రం తన నిర్ణయాన్ని ఉపసంహరించుకోకుండా సైన్యాన్ని దింపి మరింతగా బలప్రయోగానికి సిద్ధమవుతుంది. అటవీ సంపదను, అక్కడి గిరిజనుల బ్రతుకులను బాగుపరచడానికి ఖర్చు పెట్టాలని, వారికి మెరుగైన జీవనాన్ని అందించాలని ప్రజాస్వామ్య వాదులు ఎలుగెత్తి చాటుతున్నా ప్రభుత్వం పట్టించుకోకుండా బహుళజాతి సంస్థల అడుగులకు మడుగులొత్తడం పట్ల సర్వత్రా నిరసన వ్యక్తమౌతుంది. ప్రభుత్వ తీరుపై వివిధ వర్గాలు వెలువరించిన అభిప్రాయాలు ఈ విధంగా వున్నాయి.

## తక్షణం నిలిపివేయాలి



గ్రీన్‌హంట్ పేరుతో అమాయక గిరిజనుల బ్రతుకులతో కేంద్ర ప్రభుత్వం ఆటలాడుకొంటుంది. బడా వ్యాపారులకు ఖనిజ సంపదను దోచిపెట్టాలన్న కుట్రతో హోంమంత్రి చిదంబరం ఆడుతున్న నాటకం గ్రీన్‌హంట్. వేదాంత కంపెనీలో ఒక డైరక్టర్‌గా వున్న చిదంబరం ఖనిజ సంపదను కొల్లగొట్టడానికి ప్రయత్నించడం గర్హనీయం. గిరిజనుల జీవితాలపై అధ్యయనం చేసి రాజ్యాంగం కల్పించిన ఆదేశిక సూత్రాలు, ఐదవ షెడ్యూలైన 1/70 యాక్టుకు అనుగుణంగా అటవీ సంపదను, గిరిజనుల జీవితాలను బాగుపరచేందుకు ఖర్చు చేయాలి.

**- ఎన్.శ్రీనివాసులు,** *అడ్వకేట్.*

## ఆదివాసీలపై హత్యాకాండ



బహుళజాతి కంపెనీలకు లబ్ది చేకూర్చేందుకు కేంద్ర హోంమంత్రి చిదంబరం చేస్తున్న కుటిలయత్నాల్లో భాగమే గ్రీన్‌హంట్. తరతరాలుగా అడవిలో బ్రతుకుతున్న గిరిజనులను తరిమివేసి విలువైన ఖనిజ సంపదను దోచిపెట్టడానికి ఆపరేషన్ గ్రీన్‌హంట్ చేపట్టింది. ఇందుకోసం స్కార్పియన్లు, కోబ్రాలు, గ్రేహౌండ్స్ లాంటి క్రూరమైన పేర్లు గల పారామిలటరీ బలగాలను అటవీ ప్రాంతానికి పంపి హింసకు పాల్పడుతోంది. అత్యంత పాశవికంగా గిరిజన మహిళలపై అత్యాచారం చేస్తూ, గర్భిణులను తెగనరుకుతూ రక్తం త్రాగుతున్నాయి ప్రభుత్వ బలగాలు. నాగరిక సమాజంలో వుంటూ అడవి జంతువులు సైతం సిగ్గుపడేలా ప్రవర్తిస్తున్న తీరు గర్హనీయం. తక్షణం గ్రీన్‌హంట్‌ను నిలిపివేసి, మైనింగ్ కంపెనీలతో కుదుర్చుకొన్న ఒప్పందాలను రద్దు చేసుకోవాలి.

**- వై.వెంకటేశ్వర్లు,** *పౌరహక్కుల సంఘం.*

# రేషన్ స్టాక్ పాయింట్లలోనే తప్పుడు తూకాలు!

జిల్లాలో రేషన్‌షాపులు మండలస్థాయి స్టాక్‌పాయింట్ల వద్ద ఎలక్ట్రానిక్ కాటాలు ఏర్పాటు చేయాలన్న ప్రభుత్వం ఆదేశాలు నేటికి అమలుకావడం లేదు. రేషన్‌షాపుల వద్ద సాధారణ కాటాలు ఏర్పాటు చేయడం కారణంగా సరుకులు తీసుకెళ్లే ప్రజలు మోసపోతున్నారు. తూనికలు, కొలతల్లో మోసాలు వుండడాన్ని గుర్తించిన అధికారులు వీటికి స్వస్తి చెప్పి వీటి స్థానంలో ఎలక్ట్రానిక్ తక్కెడలు ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. జాయింట్ కలెక్టర్ రెవెన్యూ అధికారులతో సమీక్ష నిర్వహించి ఎలక్ట్రానిక్ తక్కెడలు ఏర్పాటు చేయాలని ఆదేశించారు.

రేషన్ షాపులకు సరుకులు పంపిణీ చేసే స్టాక్ పాయింట్లలో తూకాలు సక్రమంగా వుండడం లేదని, రికార్డుల్లో పేర్కొన్న సరుకులకు షాపుల్లో దిగుమతి చేస్తున్న వాటికి చాలా వ్యత్యాసం వుంటుందన్నది డీలర్ల వాదన. సరుకులు తక్కువగా రావడం వలన ప్రజలకు పంపిణీ చేసే సమయంలో తూకంలో కొంత వ్యత్యాసం వుంటుంది. ఈ వ్యవహారమై రేషన్ షాపు డీలర్లపై ప్రజలు పౌరసరఫరాల శాఖకు ఫిర్యాదులు చేశారు. వీటిని పరిగణలోకి తీసుకున్న అధికారులు మండలస్థాయి స్టాక్‌పాయింట్లతోపాటు రేషన్‌షాపుల వద్ద కూడా ఎలక్ట్రానిక్ తక్కెడలు ఏర్పాటు చేసే విధంగా ఆదేశాలిచ్చారు.

ఎలక్ట్రానిక్ తక్కెడలను ఏర్పాటు చేయాలని జాయింట్ కలెక్టర్ ఆదేశించి నెలరోజులు కావస్తున్నా వీటి గురించి పట్టించుకునే దిక్కు లేకుండాపోయారు. అంతేకాకుండా స్టాక్‌పాయింట్ల నుంచి సరుకులతో బయలుదేరిన వాహనం సక్రమంగా రేషన్‌షాపుకు చేరే విధంగా జి.పి.ఎన్ సిస్టమ్ కంప్యూటర్ ద్వారా పర్యవేక్షించాల్సి వుంటుంది. జిల్లాలో ఎన్ని రేషన్‌కార్డులు వున్నాయి? వీటికి ఎంతసరుకు అందిస్తున్నారన్న సమాచారాన్ని రిజిష్టర్, కంప్యూటర్ ద్వారా అందించి ప్రతి నెల రేషన్ కోటా విడుదల చేయడం జరుగుతుంది. రేషన్ కోటా విడుదల చేసే క్రమంలో కూడా స్టాక్‌పాయింట్ల వద్ద విధులు నిర్వహించే సిబ్బంది అక్రమాలకు పాల్పడుతుంటారు.

ముందుగా రేషన్‌షాపు డీలర్ల నుంచి మండల తహశీల్దార్ కార్యాలయ సిబ్బంది సరుకులకు సంబంధించిన నగదును డి.డి రూపంలో తీసుకుంటారు. మొత్తం డి.డిల వివరాలను పొందుపరచి సరుకులు విడుదల చేయాలని స్టాక్‌పాయింట్లకు నివేదిస్తారు. ఇక్కడ విధులు నిర్వహించే సిబ్బంది తమకు మామూళ్లు ముట్టచెప్పందే సరుకులు వాహనాలకు ఎక్కించరు. తప్పనిసరి పరిస్థితులలో మామూళ్లు ఇవ్వక తప్పడం లేదు. ఎవరు ముందుగా మామూళ్లు ఇస్తే అటువంటివారికి ఆలస్యం లేకుండా సరుకులు విడుదల చేస్తుంటారు. లేకుంటే కొంత ఇబ్బంది పడక తప్పదు.



స్టాకుపాయింట్‌లోనే తిష్టవేసిన అవినీతి.

కొన్ని సందర్భాలలో అర్ధరాత్రి పూట సరుకులు పంపుతుంటారు. ఈ సరుకుల్ని రేషన్‌షాపులలో దిగుమతి చేసుకునేందుకు డీలర్లు ఇబ్బంది పడడం కాకుండా, తక్కువగా సరుకులు రావడం గుర్తించ లేకపోతుంటారు. వాహనంతోపాటు వస్తున్న కూలీలు ఎక్కడపడితే అక్కడ సరుకుల్ని దింపేసి వెళ్తుంటారు. ఇదిలా వుండగా కొంతమంది డీలర్లు కావాలనే రాత్రిపూట సరుకుల్ని పంపాలని సిబ్బందిని కోరుతున్నారు. ఎందుకంటే కొంత సరుకును బయట ప్రాంతాలలో దిగుమతి చేసి బ్లాక్ మార్కెట్ వ్యాపారులకు విక్రయిస్తుంటారు. సరుకుతోపాటు స్టాక్‌పాయింట్ నుంచి వాహనంలో వచ్చిన రూట్ ఆఫీసర్ కూడా డీలర్లతో కుమ్మక్కైపోతున్నాడన్న ఆరోపణలు వున్నాయి. బియ్యం ఇతర సరుకులతోపాటు సబ్సిడీ క్రింద అందజేసే బ్లూకిరోసిన్ వాహనాలు కూడా అర్ధరాత్రి సమయంలో రేషన్‌షాపుల వద్ద దర్శనమిస్తుంటాయి. అర్ధరాత్రిపూట సరుకులు, బ్లూకిరోసిన్ విడుదల చేయరాదని గతంలో జిల్లా కలెక్టర్ ఆదేశించినా కూడా అధికారులు ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తూ పోతున్నారు. ఇప్పటికైనా జిల్లా కలెక్టర్ స్పందించి రేషన్ సరుకులు పంపిణీలో అక్రమాలను నియంత్రించాల్సిన అవసరం వుంది.

# తెలుగుదేశానికి తెగులు సోకిందా?

రాజకీయాలలో గజకర్ణ గోకర్ణ విద్యకు చంద్రబాబు పెట్టింది పేరనే అభిప్రాయం ఒకటి వుండేది. పరిస్థితులు తనకనుకూలంగా మలచుకొని, రాజకీయ ఎత్తులు వేయడంలో ఆయన సిద్ధహస్తుడనే భావన చాలా మందిలో వుంది. కానీ గత ఆరేడు నెలలుగా ఆయన తీరు చూస్తుంటే ఆ అభిప్రాయాలు తప్పేమో అన్పిస్తున్నది.

వైఎస్ మరణం తర్వాత కాంగ్రెస్ పార్టీ ఎటువంటి దుస్థితిని ఎదుర్కొంటున్నదీ అందరికీ తెలిసిన సంగతే. ఆయన నిష్క్రమణ పార్టీ మొత్తాన్ని అనాధగా మార్చింది. దిగువస్థాయిలో కార్యకర్తలకు కానీ, ఎగువ స్థాయిలో ఎమ్మెల్యేలు, మంత్రులకు కానీ ఆత్మవిశ్వాసం కల్గించగల నేత కాంగ్రెస్‌లో లేకుండా పోయారు. రేపటి మీద ఏ మాత్రం ఆశ, నమ్మకం లేని అయోమయ స్థితిలో కొట్టుమిట్టాడుతున్నారు కాంగ్రెస్‌వాదులందరూ. జగన్ ఆధిపత్య పోరు, రోశయ్య ప్రవర్తన తీరు పరిస్థితిని మరింత దిగజారుస్తున్నాయి. ప్రజలలో అటు ప్రభుత్వం పట్ల కానీ, ఇటు పార్టీ పట్ల కానీ ఎంత మాత్రం ఆదరణ లేదు. రేపటి స్థానిక ఎన్నికలకు కానీ, ఆపైన వచ్చే అసెంబ్లీ ఎన్నికలకు కానీ పార్టీ రథానికి సారధ్యం వహించే వారు కనుచూపు మేరలో కన్పించడం లేదు. ఆదాయం తగ్గి, అప్పులు పెరిగి రాష్ట్ర ప్రభుత్వం ఆర్థిక పరమైన చిక్కుముడులలో చిక్కుకపోయి వుంది. ప్రాజెక్టులు, పథకాల సంగతి దేముడెరుగు బడులకు వెళ్లే పిల్లల ఫీజులు కూడా సక్రమంగా చెల్లించలేని దివాలా స్థితికి చేరుకొన్నది ప్రభుత్వం. అభివృద్ధి కార్యక్రమాలన్నీ స్థంభించిపోవడంతో ప్రజలలో ఒక విధమైన నిర్వేదం, నిరామయ స్థితి ఏర్పడుతున్నాయి.

ఒక ప్రతిపక్ష పార్టీకి ఇంతకంటే మించిన తరుణం వేరొకటి వుండదు. అందులోనూ తెలుగుదేశం గ్రామస్థాయి నుంచి పటిష్టమైన వ్యవస్థ కల్గిన ప్రధాన ప్రతిపక్ష పార్టీ. దాని నేతకు తొమ్మిదేళ్లపాటు ముఖ్యమంత్రిగా పనిచేసిన అనుభవం వుంది. కానీ ఎందువల్లనో తెలుగుదేశం పార్టీ, చంద్రబాబు నాయుడు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోలేక పోతున్నారు. సమర్ధవంతమైన ప్రతిపక్ష పాత్ర పోషించలేక పోతున్నాడు. ప్రజలను ఆకట్టుకోవడానికి ఆయన దగ్గర ఒక్క నినాదం కూడా లేదు. రాష్ట్రాన్ని ప్రభావితం చేసే అంశాలలో ఆయన ఆలోచనలు, మాటలు చాలా పేలవంగా వుంటున్నాయి. తెలంగాణ వివాదంపై చంద్రబాబుకు స్పష్టమైన నిర్ణయం లేదు. రెండు ప్రాంతాలు తనకు రెండు కళ్ల వంటివని ఒకసారి చెప్పాడు. రెండు రాష్ట్రాలలో తెలుగుదేశం ఏర్పడితే తనకే మంచిదని మరొకసారి వ్యాఖ్యానించాడు. ఇప్పుడు జరుగుతున్న ఉప ఎన్నికల విషయంలోనూ ఆయన ధోరణి ఇంతే అస్పష్టంగా, అనిర్ణయంగా వుంది.

మద్యం వేలం పాటల విషయంలోనూ చంద్రబాబు తడబడుతున్నాడు. ప్రజలను త్రాగుబోతులుగా మార్చి, ఖజానా నింపుకోవాలని చూస్తున్న ప్రభుత్వ వైఖరిని నిరసించడం ఆయనకు చేత కావడం లేదు. మద్య ప్రవాహానికి ప్రధాన కారణం బెల్ట్ షాపుల సంస్కృతి. దాన్ని వదలిపెట్టి, మద్యాన్ని ఎంఆర్‌పి ధరలకే విక్రయించాలని విజయనగరంలో ధర్నా చేశాడు చంద్రబాబు. అంటే, త్రాగుబోతుల




అభిమానం చూరగొనడం ఆయన ఉద్దేశమని అర్ధమా?

తెలుగుదేశం పార్టీ నేతలందరూ తమ నాయకుడి ధోరణికి విసిగిపోతున్నారు. విరక్తి చెందుతున్నారు. చంద్రబాబు నాయుడులో రాజకీయ చేవ నీరుగారి పోయిందా అన్న భావన కల్గుతున్నది తెలుగుదేశం వాదులలో. ఆయన ఇంత అవ్యక్తంగా ప్రవర్తించడానికి కారణం ఏమిటన్నది వారికి అంతు బట్టడం లేదు. వైఎస్.జగన్ మీద చంద్రబాబు, ఈనాడు అధినేత రామోజీరావులకు వున్న అయిష్టత వల్లనే తెలుగుదేశం పార్టీ ఇట్లా జావగారి పోతున్నదని ఒక అభిప్రాయం. రోశయ్య ప్రభుత్వం బలహీనపడితే జగన్ గద్దె ఎక్కుతాడని, దాన్ని నివారిం

కొరవ 14వ పేజీలో

● సురేఖను చిన్నబుచ్చిన

## ముఖ్యమంత్రి వెటకారం!



వైఎస్ జగన్ వర్గంలో వీర నారిగా పేరు పొందిన కొండా సురేఖకు ముఖ్యమంత్రి నుంచి తీవ్రమైన పరాభవం ఎదురైందని చెప్తున్నారు. వైఎస్ మరణించిన నాటి నుంచి జగన్‌ను ముఖ్యమంత్రి చేయాలని పట్టుబడుతున్నారామె. జగన్‌ను సంతోష పెట్టడం కోసం చాలాసార్లు ముఖ్యమంత్రి రోశయ్యను పరుషంగా తూలనాడారు కూడా. మహబూబాబాద్ దుర్ఘటనలో ఆమె పాత్ర కీలకమైనది. జగన్ కోసం ఆమె వీధి పోరాటం చేసింది, ఆ రోజు.

ఇటీవల ఒకరోజు ఏదో పని మీద ముఖ్యమంత్రిని కలవడానికి సెక్రటరియేట్‌కు వెళ్లిందట సురేఖ. ఆ సమయంలో జిల్లాల నుంచి వచ్చిన వైశ్య ప్రముఖులతో ముచ్చటిస్తున్నాడట ముఖ్యమంత్రి. సురేఖ వచ్చిందని సిబ్బంది చెప్పగానే పిలిపించాడట. అయితే ఆమె లోపలకు రాగానే తన పై కండువాను ముఖం మీద కప్పుకొన్నాడట. ఆయన ముఖం తుడుచుకొంటున్నాడని భావించింది సురేఖ. అయితే ఎంత సేపటికీ ఆయన కండువాతో ముఖం కప్పుకొనే మాట్లాడుతుండడంతో, అదేమని అడిగిందట. దానికి ముఖ్యమంత్రి టక్కున సమాధానం చెప్పాడు. నా ముఖం కూడా చూడడానికి ఇష్టపడడం లేదని నువ్వే కదమ్మా ప్రకటన చేశావు, అందువల్ల నీకు నా ముఖం కనపడకుండా కప్పి పెడుతున్నాను అని వెటకారంగా అన్నాడట. ఆ మాటతో సురేఖ ముఖం మాడిపోయింది. చిన్నబుచ్చుకొని, మరొక మాట లేకుండా బయటకు వచ్చేసిందట.

రోశయ్యగారు పైకి చూడడానికి సాత్వికంగా కన్పిస్తారు కానీ, కఠినంగా ఉండాల్సిన చోట మాత్రం ఎవరికీ తీసిపోరు. కోపం ముక్కు మీదే వుంటుంది ఆయనకు. దాన్ని చూసిన వారికి కానీ, అదెంత తీవ్రమైనదో అర్ధం కాదు. రోశయ్యే కదా ఏమి అన్నా సర్దుకపోతాడని భావించే సురేఖ వంటి వారికి ఇటువంటి చేదు అనుభవాలు మామూలైపోయాయి.

## జగన్ తీరు మారలేదు!



జులై 8తేది నుంచి ఓదార్పు యాత్ర జరిపే విషయంలో వైఎస్.జగన్ స్థిర నిర్ణయం ఏ మాత్రం మారలేదని ఆంతరంగికులు చెప్తున్నారు. కాంగ్రెస్ అధిష్టానం కూడా అంతే మొండితనంతో వుంది. యాత్ర వద్దని వారు, చేసి తీరుతానని ఈయన పట్టుదలకు పోతున్నారు. ఆయన చేత యాత్ర విరమింపచేయాలని కెవిపి.రామచంద్రరావు, ఉండవల్లి అరుణకుమార్, రఘువీరారెడ్డి, కరుణాకర్‌రెడ్డి తదితర వైఎస్ ముఖ్యులు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. అధిష్టానం చేత యాత్రకు అనుమతి ఇప్పించాలని మేకపాటి రాజమోహన్‌రెడ్డి, అనంత వెంకటరామరెడ్డి వంటి ఎమ్పీలు పడిన తాపత్రయం వృధా అయిపోయింది. జగన్‌లో మార్పు లేదు. అధిష్టానంలో పునరాలోచన లేదు. మొత్తానికి ఓదార్పు యాత్ర ప్రతిష్టంబనకు గురై వుందిప్పుడు. ఇద్దరిలో ఎవరు తమ మొండిపట్టు సడలించుకొంటారో తెలియదు.

అధిష్టానం మాట వినకుండా జగన్ యాత్రకు వెళ్తే ఏమౌతుందన్నది ప్రశ్న. జగన్‌ను పార్టీ నుంచి సస్పెండ్ చేయడం వంటి తీవ్ర చర్యలకు అధిష్టానం పూనుకొంటుందా అన్నది ఆలోచన చేయవలసిన అంశం. అయితే ఎట్టి పరిస్థితుల్లోనూ ఢిల్లీ పెద్దలు ఆ తొందరపాటు నిర్ణయం తీసుకోరని చెప్తున్నారు. అందుకు రెండు కారణాలున్నాయి. పార్టీ నుంచి సస్పెండ్ చేస్తే, జగన్ జనం మధ్యకు వెళ్లి తమ కుటుంబానికి కాంగ్రెస్ పార్టీ అన్యాయం చేసిందనే సానుభూతి సంపాదిస్తాడు. రెండవది, వైఎస్.రాజశేఖర్‌రెడ్డి మీద ఢిల్లీ పెద్దలకు వున్న అభిమానం దృష్ట్యా జగన్ చేసే తప్పులకు తీవ్రస్థాయి శిక్ష వుండదు. అయితే అధిష్టానాన్ని లెక్క చేయకుండా జగన్ ఓదార్పు యాత్రకు వెళ్తే మాత్రం, కాంగ్రెస్ పార్టీలో ఆయనకు భవిష్యత్తు వుండదని గ్యారంటీగా చెప్పవచ్చు. తమను ధిక్కరించే వారిని ఢిల్లీ పెద్దలు ఎప్పటికీ క్షమించరు. అవకాశం దొరికినప్పుడు అణిచి పారేయడం తప్ప, ఆదరించడం అనేది జరగదు.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore.